



# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# నరసింహ శతకము








సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



**నరసింహ శతకము - శేషప్పకవి**

నరసింహ శతకము

(టీకా తాత్పర్య సహితము)

1. శ్రీ మనోహర! సురార్చిత సింధు గంభీర ! భక్తవత్సల! కోటి భానుతేజ !
కుంజనేత్ర! హిరణ్యకశిపు నాశక! శూర! సాధురక్షణ! శంఖచక్రహస్త
ప్రహ్లాదవరద! పాపధ్వంస! సర్వేశ క్షీరసాగరశాయి! కృష్ణవర్ణ!
పక్షివాహన! లసద్భ్రమరకుంతలజాల! పల్లవారుణ పాదపద్మ యుగళ
చారుశ్రీచందనాగరు చర్చితాంగ!
కుదకుట్మలదంత! వైకుంఠధామ!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!.

ధర్మపురినందు నివసించు నరసింహస్వామిని గూర్చినదీ శతకము. మొదటి పద్యమునందుస్వామి గుణగణములను రూపమును గూర్చి వర్ణించి నమస్కార మొనర్చెను. ఆ రూపము ఆభరణములచే ప్రకాశింపబడునది. కోటిమంది సూర్యులతో సమానముగా ప్రకాశించునది. కమలములే నేత్రములుగా కలది. శంఖచక్రధారియైనది. నల్లని శరీరకాంతి కలది. ఎఱ్ఱని పాదపద్మములు, మల్లెమొగ్గల వంటి దంతకాంతులు, అగరు, గంధముల మైపూత కలది, ఆ గుణ గణములు, నిత్యస్తవనీయమైనది. భక్తులు యందు వాత్సల్యము, సాధు సంరక్షణ, పాపనాశనము ప్రపంచమునకు అధిపతియై ఉండియు విరాగి, దుష్టదైత్యవినాశన మొదలగునవి.

2. పద్మలోచన! సీసపద్యముల్ నీ మీద జెప్పఁబూనితినయ్య! చిత్తగింపు
గణ యతి ప్రాస లక్షణముఁ జూడగలేదు; పంచకావ్య శ్లోక పఠనలేదు,
అమరకాండత్రయం బరసి చూఁడగలేదు, శాస్త్రీయ గ్రంథముల్ చదువలేదు,
నీ కటాక్షంబున నే రచించెదఁ గాని ప్రజ్ఞ నాయది కాదు ప్రస్తుతింపఁ
దప్పు గలిగిన సద్భక్తి తక్కువౌనె?
చెఱకునకు వంకపోయినఁ జెడునె తీపిఁ
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహస్వామీ ! కమలనేత్రా, నీయందు భక్తిచే సీస పద్యములు చెప్పబూనితి నే కాని నాకు ఛందస్సు తెలియదు పద్యరచన తెలియదు. చదువే రాని వాడు పండిత సభలోదిగ్దంతుత నోడించి బహుమతి గెల్చుకొన్నట్లు నీపై పద్యములు నీవే వ్రాయించుకొంటివి స్వామీ. ఇది నా ప్రజ్ఞ కాదు, కాకపోతే నాకున్నదల్లా నీ మీద అనన్యమైన భక్తియే.

3. నరసింహా! నీ దివ్యనామ మంత్రముచేత దురితజాలము లెల్లఁ దోలవచ్చు,
నరసింహ! నీ దివ్యనామ మంత్రముచేత బలువైన రోగముల్ పాపవచ్చు,
నరసింహ! నీ దివ్యనామ మంత్రముచేత రిపు సంఘములు సంహరింపవచ్చు,
నరసింహ! నీ దివ్యనామ మంత్రముచేత దండహస్తుని బంట్లఁ దఱుమవచ్చు!
భళిర ! నే నీ మహామంత్ర బలముచేత
దివ్య వైకుంఠ పదవి సాధించవచ్చు!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా! అతి పావనమైన నీ మంత్రనామస్మరణచేత పాపములను నాశనముచేసుకొనవచ్చును. తీవ్రమైన రోగముపోగట్టుకొనవచ్చును. విరోధులను మట్టుపెట్టవచ్చును. యమభటులను తఱుమవచ్చును. నీ నామ మహత్యము పొగడుట నా వశమా! సాధిం

చరాని పనులను కూడ నీనామమహత్తముతో చేయవచ్చును. వైకుంఠములో కూడ నివసింపవచ్చును.

4. ఆదినారాయణా యనుచు నాలుకతోడఁ బలుక నేర్చినవారి పాదములకు
సాష్టాంగమున నమస్కార మర్పణఁజేసి ప్రస్తుతించెదనయ్య బహువిధముల
ధరణిలో నరులెంత దండవార్తైనను నిన్ను ఁగాననివారి నే స్మరింప
మేము శ్రేష్టుల మంచు మిదుకుచుండెడివారి చెంతఁ జేరఁగ బోను శేషశయన!
పరమ సాత్వికులైన నీ భక్తవరుల
దాసులకు దాసుడఁడను జుమీ ధాత్రీలోన,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఆదినారాయణా! దేవా! అని స్మరణచేసేవారిపాదములకు సాష్టాంగవందనము చేసెదను. ధరణిలో ఎంతఘనుడైనా నీ నామము స్మరించని వారి దగ్గఱకి పోను. శ్రేష్టులమని మిడిసిపాటు పడేవారి వద్దకు అసలేపోను. శేషశయనా! పరమ సాత్వికులైన నీ భక్తవరులకు దాసానుదాసుడను.

5. ఐశ్వర్యములకు నిన్నునుసరింపఁగలేదు, ద్రవ్య మిమ్మని వెంటఁ దగులలేదు
కనకమిమ్మని చాలఁ గష్టపెట్టఁగ లేదు! పల్లకిమ్మని నోటఁ బలుక లేదు,
సొమ్ము లిమ్మని నిన్ను నమ్మి కొల్వఁగ భూములిమ్మని పేరు పొగడ లేదు,
బలము లిమ్మని నిన్ను బ్రతిమాలఁగా లేదు, పనుల నిమ్మని పట్టు బట్టలేదు,
నేను గోరిన దొక్కటే నీలవర్ణ!
చయ్యనను మోక్షమిచ్చినఁ జాలు నాకు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఐశ్వర్యముకోసం నిన్ను సేవింపలేదు, ద్రవ్య మిమ్మని వెంటఁ పడలేదు. కనకమిమ్మని

**నిన్ను కష్టపెట్ట లేదు! పల్లకిమ్మని నోటఁ బలుక లేదు. సొమ్ము లిమ్మని, భూములిమ్మని ని న్ను కీర్తించ లేదు. సామర్థ్యమునిమ్మని నిన్ను బ్రతిమాలలేదు, పనుల నిమ్మని పట్టు బట్ట లేదు, నేను కోరిన దొక్కటే నీలవర్ణ! తక్షణమే మోక్షమిచ్చినఁ జాలు నాకు.**

6. మందుండనని నన్ను నిందఁజేసిన నేమి? నా దీనతను జూచినవ్వనేమి?
దూరభావము లేక తూలనాడిననేమి? ప్రీతిసేయక వంక బెట్టనేమి?
కక్కసంబులు పల్కి వెక్కిరించిన నేమి? తీవ్రకోపముచేతఁ దిట్టఏమి?
హెచ్చుమాటలచేత నెమ్మెలాడిన నేమి? చేరి దాపట గేలి సేయనేమి?
కల్పవృక్షంబువలె నీవు కల్గ నింకఁ
బ్రజల లక్ష్యంబు నాకేల! పద్మనాభ!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ పద్మనాభ! తెలివితక్కువవాడని నన్ను జనుల నింద చేసిన పర్వాలేదు. నా దీనత్వ ము చూచి నవ్వినా, తూలనాడినా, ప్రీతిసేయక వంక పెట్టినా, కఠినమాటలతో నన్ను వెక్కిరించినా, తీవ్రకోపముచేత తిట్టినా, దరిచేరి ఎగతాళి చేసినా, కల్పవృక్షంబువలె నీవు కొండంత అండగా వుండగా ఈ ప్రజలను లక్ష్యపెట్టడమెందుకు!**

7. చిత్తశుద్ధిగ నీకు సేవఁజేసెదఁగాని పుడమిలో జనుల మెప్పులకు గాదు,
జన్మ పావనతకై స్మరణ జేసెదఁగాని, సనివారిలోఁ బ్రతిష్ఠలకుఁగాదు
ముక్తికోసము నేను మ్రొక్కి వేఁడెదఁగాని దండిభాగ్యము నిమిత్తంబుగాదు,
నిన్ను బొగడ విద్య నేర్పితినేకాని, కుక్షి నిండెడు కూటి కొఱకుఁగాదు,
పారమార్థికమునకు నేఁ బాటుపడితిఁ
గీర్తికి నపేక్ష పడలేదే కృష్ణవర్ణ!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నల్లనయ్యా! చిత్తశుద్ధిగ నీకు సేవఁజేసెదను గాని, పుడమిలో జనుల మెప్పుల కోసం గాదు, జన్మ పావనంకోసం స్మరణ జేసెదనుగాని, తోటివారిలో పేరుప్రతిష్ఠలకు కాదు. ముక్తికోసము నేను మ్రొక్కి వేడెదనుగాని, గొప్ప భోగభాగ్యములకోసం కాదు, నిన్ను పొగడడం కోసం విద్య నేర్చితినేకాని, పొట్టనింపె కూటి కొఱకుఁగాదు, పారమార్థిక మునకు నేను పాటుపడితిని గాని కీర్తినపేక్షించికాదు!

8. శ్రవణ రంధ్రముల నీ సత్కథల్ పొగడంగ లేక మానందంబు లేనివాఁడు
పుణ్యవంతులు నిన్నుఁబూజసేయఁగ జూచి భావమందుత్సాహ పడనివాఁడు
భక్తవర్యులు నీ ప్రభావముల్ పొగడంగఁ దత్పరత్వము లేక తలఁగువాఁడు
తన చిత్తమందు నీ ధ్యాన మెన్నందులేక కాలమంతయు వృథా గడుపువాఁడు
వసుధలోనెల్ల వ్యర్థుండు వాఁడె యగును;
మఱియుఁజెడుఁగాక యెప్పుడు మమతనొంది;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా ! ఈ భూమి యందు నిష్ప్రయోజకుడెవరనగా, నిన్ను పూజింప లేనివాడు, నిన్ను తలంపనివాడు, నీగుణ గణముల వర్ణింపగా వినలేని వాడు, నిన్ను నిందించువాడు. అట్టి అవగుణములు నా దరిచేరనీయక నన్ను రక్షింపుము.

9. గౌతమీ స్నానానఁ గడతేరుదమటన్న మొనసి చన్నీళ్ళలో మునుఁగలేను;
దీర్థయాత్రలచేఁ గృతార్థు డౌదమటన్న బడలి నీమంబులె నడపలేను;
దానధర్మముల సద్గతినిఁ జెందుదమన్న ఘనముగా నా యొద్ద ధనములేదు;
తపమాచరించి సార్థకము నొందుదమన్న నిమిషమైన మనస్సు నిలుపలేను;
కష్టములకోర్వ నాచేతఁగాదు; నిన్ను
స్మరణఁజేసెద నా యథాశక్తికొలది
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ భక్తవత్సలా, నేను ఏ నియమములు, నిష్టలు పాటించలేను. గోదావరిలో చన్నీటి స్నానము చేయలేను. దాన ధర్మములు చేయ ధనము లేనివాడను. నాకున్నది నా చేతనైనది, నీ మీద అపారమైన భక్తి, నీ నామస్మరణ. నన్నెట్లు రక్షింతువో నీ ఇష్టం.

10. అర్థివాండ్రకు నీక హానిఁజేయుటకంటెఁ దెంపుతో వసనాభిఁ దినుటమేలు;
ఆఁడుబిడ్డల సొమ్ము లపహరించుటకంటె బండఁగట్టుక నూతఁబడుట మేలు;
పరులకాంతలఁ బట్టి బల్మిఁ గూడుటకంటె; బడబాగ్ని కీలలఁబదుట మేలు;
బ్రతుకఁజాలక దొంగపనులు సేయుటకంటెఁ గొంగుతో ముష్టెత్తుకొనుట మేలు;
జలజదళనేత్ర! నీ భక్త జనులతోడి
జగడమాడెదు పనికంటెఁ జావుమేలు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా ! భిక్షమెత్తు వానికి ఇవ్వక బాధించుట కంటే విషము తినుటమేలు. స్త్రీల సొత్తు తినుట కంటే ఆత్మహత్య మేలు. పరస్త్రీ బలాత్కారము అగ్ని సదృశ్యము. దొంగతనము కన్న యాచన మేలు. కాని అన్నింటి కంటె హీనమైన పని నీ భక్తులతో వాదులాడుట. అట్టి హీనాతి హీనమైన పనికి నా మనసు పోకుండ రక్షింపుము.

11. గార్ధభంబున కేల కస్తూరి తిలకంబు? మర్కటంబున కేల మలయజంబు?
శార్దూలమున కేల శర్కరాపూపంబు?సూకరంబునకేల చూతఫలము?
మార్జాలమున కేల మల్లెపువ్వులబంతి? గుడ్లగూబల కేల కుండలములు?
మహిషంబు కేల నిర్మలమైన వస్త్రముల్? బకసంతతికి నేల పంజరంబు?
ద్రోహచింతనఁ చేసెడి దుర్జనులకు
మధురమైనట్టి నీ నామ మంత్రమేల?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా! దుష్టులకు నీ నామమంత్రము, గాడిదకు కస్తూరి బొట్టు, కోతికి గంధము, పులికి చక్కెర పిండి వంటలు, పందికి మామిడిపండు, పిల్లికి మల్లెపూలచెండు,

**గుడ్లగూబకు చెవిపోగులు, దున్నపోతుకు మంచి వస్త్రములు, కొంగలకు పంజరము ఎలా అవసరం లేదో దుర్మార్గులకు నీ నామము రుచింపదు.**

12. పసరంబు పంజైనఁ బసులకాపరి తప్పు, ప్రజలు దుర్జనులైనఁ బ్రభుని తప్పు,
భార్య గయ్యాళైనఁ బ్రాణనాథుని తప్పు, తనయుఁడు దుడుకైన దండ్రి తప్పు,
సైన్యంబు చెదరిన సైన్యనాథుని తప్పు, కూతుఁరు చెడుగైన మాతతప్పు,
అశ్వంబు దురుసైన నారోహకుని తప్పు, దంతి మదించ మావంతు తప్పు,
ఇట్టితప్పు, లెఱుంగక యిచ్చవచ్చి
నటుల మెలఁగుదు రిప్పు డీ యవని జనులు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ పరమాత్మా! భూమి లోని జనులు తమ తప్పులను తెలుసుకోలేక తమ ఇచ్ఛవచ్చిన రీతిలో ప్రవర్తిస్తున్నారు. పశువు పనికి రానిదైన పశువుల కాపరిది తప్పు. ప్రజలు దుర్జనులైన రాజుది తప్పు . భార్య గయ్యాళైన భర్తది తప్పు . పుత్రుడు దుర్మార్గుడైన తండ్రి తప్పు . పుత్రిక చెడ్డనడత కలదియైన తల్లిది తప్పు . సైన్యము పిరికిదైన సేనాపతి తప్పు . అట్లే జనులు తప్పు చేయుచున్న దిద్దని దైవమయిన నీదే తప్పు. కాబట్టి జనులు తమ తప్పు తెలుసుకొనునట్లు చేయుము పరంధామా !**

13. కోతిఁకి జలతారు కుళ్ళాయి యేటికి? విరజాజిపూదండ విధవకేల?
ముక్కిడితొత్తుకు ముత్తెంపు నత్తేల? యద్దమేమిటికి జాత్యంధునకును?
మాచికమ్మకు నేల మౌక్తికహారముల్? క్రూరచిత్తునకు సద్గోష్ఠి లేల?
ఱంకుఁబోతుకు నేల రమ్యంపు నిష్ఠలు? వావి యేటికి దుష్ట వర్తనునకు?
మాటనిలకడ సుంకరి మోటు కేల?
చెవిటివానికి సత్కథా శ్రవణమేల?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా! లోకములో వ్యర్థమయిన పదార్థములు - కోతికి జరి టోపీ, విధవరాలికి పూల చెండు, ముక్కులేని దానికి ముక్కుపోగు, గుడ్డివానికి అద్దము, మాచి కమ్మకు ముత్యాల దండలు, దుర్మార్గునకు మంచి మాటలు, వేశ్యకు ఆచార నియమాలు, వావి వరుసలు లేని దుర్జనునకు మంచి మాటలు, చెవిటివానికి మంచి కథలు మొదలైనవి.

14. మాన్యంబులీయ సమర్థుఁడొక్కఁడు లేఁడు; మాన్యముల్ చెఱుప సమర్థులంత;
యెండిన యూళ్ళ గోడెఱిఁగింపఁ డెవ్వఁడుఁ; బండిన యూళ్ళకు ప్రభువులంత
యితఁడు పేద యటంచునెఱింఁగింపఁ డెవ్వఁడు; గలవారి సిరులెన్నఁగలరు చాలఁ
దన యాలి చేష్టలఁదప్పెన్నఁ డెవ్వఁదుఁ బెఱకాంత తప్పెన్న ఁ బెద్దలంత;
యిట్టి దుష్టు కధికార మిచ్చినట్టి
ప్రభువు తప్పులటంచును బలుకవలెను;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా ! మంచి పనులు చేయువారు చాల తక్కువ. వేళ్ళమీద లెక్కింపవచ్చు. భూములీయగల వారు లేరుగాని, ఆక్రమించుటకు అందరూ సిద్ధమే. బంజరు భూము లలో పంట పండించువారు లేరు గాని, పంట భూములలో పంటకోసం తగాదా పడు వారు మెండు. సిరిగలవాని నెన్నినట్లు బీదవాని గౌరవింపరు. పరస్త్రీలరంకుతనము నెన్ను వారు తండోపతండములు. తప్పంతా ఇటువంటివారికదికారమిచ్చిన ప్రభువులదే.

15. తల్లి గర్భమునుండి ధనము దేఁడెవ్వఁడు, వెళ్ళిపోయెడినాఁడు వెంటరాదు,
లక్షాధికారైన లవణ మన్న మెకాని, మెఱుఁగు బంగారంబు మ్రింగఁబోఁడు
విత్తమార్జనఁజేసి విఱ్ఱవీఁగుటె కాని, కూడఁబెట్టిన సొమ్ము గుడువబోఁడు,
పొందుగా మఱుఁగైన భూమిలోపలఁబుట్టి దానధర్మము లేక దాఁచి దాఁచి,
తుదకు దొంగల కిత్తురో? దొరల కవునొ?
తేనె జుంటీ గ లియ్యవా తెరువరులకు?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా! తల్లిగర్భం నుంచే ధనముతేడు ఎవ్వడు. పోయోటప్పడు ఈ ధనము కూడ రాదు. లక్షాధికారైనా ఉప్పు, అన్నమే తినాలి గాని, బంగారం మింగలేడు. తేనెటీగలు తేనె ను పరులకిచ్చినట్లు ధనము కూడ బెట్టి, దానముకూడచేయక, అనుభవింపని వాడు ఆ సొమ్మును దొరల పాలో, దొంగలపాలో చేయును.

16. లోకమం దెవఁడైన లోభిమానముఁడున్న భిక్షమర్థికిఁ జేతఁ బెట్టలేఁడు,
తాను బెట్టకయున్న ఁదగవు పుట్టదుకాని యొరులు పెట్టఁగజూచి యోర్వలేఁడు,
దాతదగ్గర జేరి తన ముల్లె చెడినట్లు జిహ్వతోఁ జాడీలు చెప్పుచుండు
ఫలము విఘ్నంబైనఁ బలు సంతసము నందు, మేలుకల్గినఁ జాల మిణుఁకుచుండు,
శ్రీరమానాథ! యిటువంటి క్రూరునకును
భిక్షుకుల శత్రువని పేరు బెట్టవచ్చు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

స్వామీ ! భిక్షకులకు శత్రువు ఎవరంటే పరమలోభి. తానీయక, ఇతరులు ఇస్తూంటే కొండెములు చెప్పి ఈయనీయక, పరులకు మేలు కల్గిన దుఃఖించువాడే పరమలోభి, అతనిని చూచినను పాపము కల్గును.

17. తనువులోఁ బ్రాణముల్ తరలిపోయెడివేళ నీ స్వరూపమును ధ్యానించునతఁడు
నిమిషమాత్రములోన నిన్ను ఁజేరునుగాని, యమునిచేతికిఁ జిక్కి శ్రమలఁబడఁడు
పరమసంతోషాన భజనఁ జేసెడివాని పుణ్య మేమనవచ్చు భోగిశయన!
మోక్షము నీ దాస ముఖ్యుల కగు గాని నరక మెక్కడిదయ్య నళిననేత్ర!
కమలనాభుని మహిమలు కానలేని
తుచ్ఛులకు ముక్తి దొరకుట దుర్లభంబు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ పన్నగ శయనా! అవసాన కాలమున నైన నిన్నొక్కపరి తలచిన స్వర్గలోక ప్రాప్తి

కలుగును. అటువంటిది నిత్యము నిన్ను స్మరించు వానికి ముక్తియే తప్ప నరకములేదు. నీ మహిమ తెలుసుకోలేని నీచులకు ముక్తి సాధ్యము కాదు.

18. నీలమేఘశ్యామ! నీవె తండ్రివి మాకు, కమలవాసిని మిమ్ముఁగన్న తల్లి,
నీ భక్తవరులంత నిజమైన బాంధవుల్, నీ కటాక్షము మా కనేకధనము,
నీ కీర్తనలు మాకు లోక ప్రపంచంబు, నీ సహాయము మాకు నిత్యసుఖము,
నీ మంత్రమే మాకు నిష్కళంకపు విద్య, నీ పద ధ్యానంబు నిత్య జనము
తోయజాతాక్ష! నీ పాద తులసిదళము
రోగముల కౌషధము బ్రహ్మరుద్ర వినుత!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ భక్తవత్సలా! నీవే తల్లివి, తండ్రివి... నిజముగ కృష్ణా. నీ భక్తులే మాకు నిజమైన బంధువులు. నీ కటాక్షమే మాకు ధనము. నీ కీర్తనలే మాకు ప్రపంచము. సదా నిన్నే స్మరించుచూ, నీ చరణములు మీద తులసీ దళమే ఔషధముగా స్వీకరించు నన్ను సదా రక్షింపుము తండ్రీ.

19. బ్రతికినన్నాళ్ళు నీ భజన తప్పను గాని, మరణకాలమునందు మఱతునేమొ?
యావేళ యమదూత లాగ్రహంబున వచ్చి ప్రాణముల్ పెకలించి పట్టునపుడు
కఫ వాత పైత్యముల్ కప్పఁగా భ్రమచేతఁ గంప ముద్భవమంది, కష్టపడుచు
నా జిహ్వతో నిన్ను నారాయణా! యంచుఁ బిలుతునో! శ్రమచేతఁ బిలువలేనో?
నాటికిప్పుడె చేసెద నామభజనఁ
దలఁచెదను జేరి వినవయ్య! ధైర్యముగను,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా ! స్వామీ! అంత్యకాలమున యమ భటులు తమ వీరాలాపములతో బాధ

పెట్టునప్పుడు, రోగములు ముంచుకు వచ్చినపుడు, నీ నామస్మరణ మరతునేమో. నాటి కిపుడే నీ నామస్మరణ చేయుదును.
ముప్పున కాలకింకరులు.. దాశరథీ కరుణా పయోనిధీ పద్యభావమే ఇదికూడా.

20. పాంచభౌతికము దుర్భరమైన కాయం బి దెప్పుడో విడుచుట యెఱుకలేదు,
శతవర్షములదాఁక మితముఁ జెప్పిరి కాని, నమ్మరాదామాట నెమ్మనమున!
బాల్యమందో; మంచి ప్రాయమందో, లేక ముదిమియందో, లేక ముసలియందో,
యూరనో, యడవినో, యుదకమధ్యముననో, యెప్పుడో యేవేళ నే క్షణంబొ?
మరణమే, నిశ్చయము, బుద్ధిమంతుఁడైన
దేహ మున్నంతలో మిమ్ముఁ దెలియవలయు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నారసింహా! మరణమెపుడో తెలియని మానవుడను. నా పూర్వపుణ్యమున నిన్ను స్మర ణ చేయు జ్ఞానము నాకిచ్చితివి. నీ స్మరణము మానకుండు శక్తిని నాకిమ్ము తండ్రి.

21. తల్లిదండ్రులు భార్య తనయు లాప్తులు బావ మఱఁదు లన్నలు మేన మామగారు,
ఘనముగా బంధువుల్ కల్గినప్పటికైనఁ దాను దర్లగ వెంటఁదగిలి రారు,
యమునిదూతలు ప్రాణ మపహరించుక పోఁగ మమతతోఁ బోరాడి మాన్పలేరు,
బలగమందఱు దుఃఖపడుట మాత్రమె కాని, యించుక యాయుష్య మీయలేరు,
చుట్టములమీఁది భ్రమఁదీసి చూరఁజెక్కి
సంతతము మిమ్ము నమ్ముట సార్థకంబు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

తల్లిదండ్రులు, భార్య, తనయులు, ఆప్తులు, బావమఱఁదులు, అన్నలు, మేన మామ, బంధువులు అంత్యకాలములో వెంట సాయానికి రారు, యమునిదూతలు ప్రాణము

తీస్తోంటే మమతతో పోరాడి ఆపలేరు, బందువు దుఃఖపడుదురే కాని, ఆయుష్ష పోయ లేరు. కాబట్టి బంధువుల మీద మమకారము మాని నిన్నే నమ్మియుండుట మేలు.

22. ఇభరాజవరద! నిన్నెంత పిల్చిన గాని మాఱు పల్కవదేమి మౌనితనమొ,
మునిజనార్చిత! నిన్ను మ్రొక్కి వేడినఁగాని కనులఁజూడ వేదేమి గడుసుదనమొ?
చాల దైన్యమునొంది చాటు జొచ్చినఁగాని భాగ్యమీయ వదేమి ప్రౌఢతనమొ?
స్థిరముగా నీపాద సేవఁ జేసెదనన్న దొరకఁజాల వదేమి ధూర్తతనమొ?
మోక్షదాయక! యిటువంటి మూర్ఖజనునిఁ
గష్టపెట్టిన నీకేమి కడుపునిండు?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

స్వామీ ! పిలచినా పలుకవేమి దైవమా! నేను గజేంద్రుని వలె నీ కాప్పుడను కానా! మునులకు సాక్షాత్కరించు నీవు నాకు కనపడక గడుసుతనము చూపెదవేల ? భక్తవరదా! నీ పాదసేవజేయు నాకు దొరకవేమి తండ్రీ! నన్నెందుకు పరీక్షిస్తున్నావయ్యా!

23. నీ మీద కీర్తనల్ నిత్యగానముఁ జేసి రమ్య మొందింప నారదుఁడ గాను;
సావధానముగ నీ చరణపంకజసేవ సలిపి మెప్పించంగ శబరిఁగాను;
బాల్యమప్పటినుండి భక్తి నీయందునఁ గలుగును బ్రహ్లాద ఘనుఁడఁగాను;
ఘనముగా నీమీఁద గ్రంథముల్ కల్పించి వినుతిసేయను వ్యాస మునిని గాను;
సాధువును, మూర్ఖజాతి, మనుష్యాథముఁడను;
హీనుడఁగు, జుమ్మి; నీవు నన్నేలు కొనుము!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నీ మీద కీర్తనలు చేయడానికి నారదుడను కాను, నీ పాదసేవతో నిన్ను మెప్పించ శబరి ని కాను, చిన్ననాటి నుంచి భక్తితో నిను కొలిచిన ప్రహ్లాదుని కాను. నీపై రచనలు చేసి

**వేనోళ్ళ కీర్తించ వ్యాసముని కాను. మానవులలో అత్యల్పుడయిన, హీనుండయిన నన్నేలు కొనుటలోనే నీకు ఘనతఉన్నది స్వామీ!**

24. అతిశయంబుగఁ గల్లలాడ నేర్పితిఁగాని పాటిగా సత్యముల్ బలుకనేర;
సత్కార్య విఘ్నముల్ సలుపనేర్చితిఁగాని యిష్ట మొందఁగ నిర్వహింపనేర;
నొకరిసొమ్ముకు దోసిలొగ్గనేర్చితిఁగాని చెలువుగా ధర్మంబు సేయనేర;
దనము లీయంగ వద్దనఁగ నేర్చితిఁగాని శీఘ్రమిచ్చెడునట్లు చెప్పనేర;
బంకజాతాక్ష! నే నతి ఆతకుఁడను
దప్పులన్నియు క్షమియింపఁ దండ్రివీవె;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**కమలనేత్రా! నేనెంతో దుష్టుడను, దుర్మార్గమయిన పనులు చేయువాడనైనప్పటికిమన్నించి సన్మార్గమున తిప్పవలసిన వాడివి నీవే కదా!తప్పులు జేయుట మావంతు,దండన బొందుట మావంతు, దయజూపడమే నీవంతు అన్నట్లు, అసత్యవాదిని, యాచకుడను, మంచి పనులను చెడగొట్టువానిని అయిన నన్ను కాపాడుము తండ్రీ.**

25. ఉర్విలో నాయుష్యమున్న పర్యతంబు మాయ సంసారంబు మరగి, నరుఁడు
సకల పాపములైన సంగ్రహించునుగాని  నిన్ను జేరెడి యుక్తి నేర్వలేఁడు,
తుదకుఁ గాలునియొద్ద దూత లిద్దఱువచ్చి గుంజక చని వారు గ్రుద్దుచుండ,
హింస కోర్వఁగలేక యేడ్చి గంతులుమేసి దిక్కులేదని నాల్గు దిశలు చూడఁ
దన్ను విడిపింప వచ్చెడి ధన్యుఁడెవరు?
ముందె నీ దాసుఁడై యున్న ముక్తిగలుగు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ నారసింహా ! మానవుడు ఆయువు వున్నంత వరకు సంసార లంపటము లందు చిక్కి నీపై భక్తిని మరచి యన్నో పాతకములను మూటకట్టుకొనుచున్నాడు. చివరకు**

యమభటులు బాధించు సమయములో ఎవ్వరూ లేరని వాపోయి ఎమి లాభము. నీపై సద్భక్తి యున్న యిన్నితిప్పలుండవు కదా!

26. అధిక విద్యావంతుల ప్రయోజకులైరి, పూర్ణశుంఠలు సభా పూజ్యులైరి,
సత్యవంతుల మాట జనవిరోధంబాయె, దరువపోతులమాట వాసికెక్కె,
ధర్మవాసనపరుల్ దారిద్ర్య మొందిరి, పరమలోభులుధన ప్రాప్తులైరి,
పుణ్యవంతులు రోగ భూత పీడితులైరి, దుష్ట మానవులు వర్ధిష్ణులైరి,

పక్షివాహన ! మావంటి భిక్షుకులకు
శక్తిలేదాయె, నిఁక నీవె చాటు మాకు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

గరుడవాహనా! గొప్పవిద్యావంతులు పనికిమాలినవారయ్యారు. అయెగ్యులు సభామర్యాదలనందు కుంటున్నారు. సత్యముపలికే వారు జనవిరోధులయ్యారు. వ్యర్ధవాదనచేయువారుకీర్తిగడించారు. ధర్మముననుసరించేవారు దారిద్రమునకులోనయ్యారు. పరమపిసినారులుధనవంతులయ్యారు. పుణ్యశీలురు రోగాలపాలయ్యారు. దుష్టమానవులు వర్ధిల్లుతున్నారు.మావంటి యాచకులకు శక్తిలేదు. మమ్ము రక్షించు భారము నీదే.

27. భుజబలంబునఁ బెద్దపులులఁ జంపగవచ్చు, పాముకంఠముఁ జేతఁ బట్టవచ్చు,
బ్రహ్మరాక్షసి కోట్లబాఱఁ ద్రోలఁగ వచ్చు, మనుజుల రోగముల్ మాన్పవచ్చు,
జిహ్వ కిష్టముగాని చేదు మ్రింగఁగ వచ్చు, బదును ఖడ్గము చేత నదుమవచ్చుఁ,
గష్టమొందుచు ముండ్ల కంపలోఁ జొరవచ్చుఁ దిట్టుపోతుల నోళ్ళు కట్టవచ్చుఁ,
బుడమిలో దుష్టులకు జ్ఞానబోధఁ దెలిపి
సజ్జనుల జేయలేఁడెంత చతురుఁడైన,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా! భుజబలతో పెద్దపులులను చంపవచ్చును, పాముకంఠముఁ చేత్తో పట్టుకో వచ్చును, కోటి బ్రహ్మరాక్షసులను పాఱత్రోలవచ్చును, మనుషుల రోగములు పోగొట్ట వచ్చు, నాలుకకు రుచించని చేదు మ్రింగ వచ్చు, పదునైన ఖడ్గమును చేత్తో అదుమవ చ్చుఁ, కషమైన ముండ్ల కంపలోఁ ప్రవేశింపవచ్చును. తిట్టేవాళ్ల నోళ్ళు కట్టవచ్చును. భుజ శక్తి గలవారు ఎన్ని అసాధ్య కార్యములు చేసినప్పటికి, దుష్టవర్తనులకు జ్ఞానబోధ చేసి సన్మార్గులను చేయలేరు.

28. అవనిలోఁగల యాత్రలన్ని చేయఁగవచ్చు, ముఖ్యుడై నదులందు మునుఁగవచ్చు,
ముక్కుపట్టుక సంధ్య మొనసి వార్వఁగవచ్చు, దిన్నగాఁ జపమాల ద్రిప్పవచ్చు,
వేదాల కర్తంబు విఱిచి చెప్పఁగవచ్చు, శ్రేష్ఠయాగములెల్లఁ జేయవచ్చు,
నైష్ఠికాచారముల్ నడుపవచ్చు,
జిత్త మన్యస్థలంబునఁ జేరకుండ
నీ పదాంభోజములయందు నిలుపరాదు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ సన్నుత పుణ్యమూర్తి! నా మనసనే కోతికి నీయందే నిశ్చలభక్తి నిచ్చి పుణ్యము కట్టుకొ నుము. అది ఎంత చంచలమయినదంటే, ఎన్ని తీర్థ యాత్రలు చేసినను, పుణ్యనదులం దు స్నానమాచరించినా
కుంకులిడినను,
జపములు చేసినను, ప్రాపంచిక సుఖములందే మగ్నమగును గానీ నీయందే ధ్యానవ యించదు.

29. కర్ణయుగ్మమున నీ కథలు సోఁకినఁ జాలు పెద్ద పోగుల జోళ్ళు పెట్టినట్లు
చేతు లెత్తుచుఁ బూజ సేయఁగల్గినఁజాలు తోరంపుఁ గడియాలు తొడిగినట్లు,
మొనసి మస్తకముతో మ్రొక్కఁగల్గినఁజాలు చలువమైన తురాయి చెక్కినట్లు,
గళము నొవ్వఁగఁ గథల్ పలుకఁగల్గినఁజాలు, ఎంతగాఁ గంఠీలు వేసినట్లు,

పూని నినుఁ గొల్చుటే సర్వ భూషణంబు,
లితర భూషణముల నిచ్చగింపనేల?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**నీ భక్తులకు నీ పూజయే సర్వాభరణముల నొసగు చుండగా నిజమైన ఆభరణముల మీది ఆశ ఎందులకు ? నీ పూజ యొకటి చాలదా దేవదేవా!**

30. భువన రక్షక! నిన్ను ఁ బొగడనేరని నోరు ప్రజ కరోచకమైన పాడుబొంద,
సురవరార్చిత! నిన్నుఁజూడఁగోరని కనుల్ జలములోపల నెల్లి సరపుగుండ్లుఁ
శ్రీ రమాధిప! నీకు సేవఁజేయని మేను కూలి కమ్ముడువోని కొలిమి తిత్తి,
వేడ్కతో నీ కథల్ వినని కరణములైనఁ గఠిన శిలాదులఁ గలుగు తొలులు,
పద్మలోచన! నీమీద భక్తిలేని
మానవుఁడు రెండు పాదాల మహిషమయ్య,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**లోకరక్షకా! నీయందు భక్తిలేని మానవుడు రెండు పాదముల దున్నపోతుతో సమానమ యా! నిన్ను పొగడగలేని నోరు, నిను చూడకోరని కనులు, నీకు సేవచేయలేని శరీ రము, నీ మహిమలు వినని చెవులు ఎందుకయా?**

31. అతివిద్య నేర్చుట యన్న వస్త్రములకే, పనుల నార్జించుట పాడికొఱకె,
సతినిఁబెండ్లాడుట సంసార సుఖముకే, సుతులఁ బోషించుట గతులకొఱకె,
సైన్యమున్ గూర్చుట శత్రు భయంబు కె, సాము నేర్చుటలెల్ల జావుకొఱకె,
దానమిచ్చుటయు ముందటి సచితమునకె, ఘనముగాఁ జదువు కడుపుకొఱకె,
యితర కామంబుఁ గోరక సతతముగను
భక్తినీయందు నిలుపుట ముక్తికొఱకె,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!

దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ప్రతి పనికి కార్యకారణ సంబంధము కలదు. విద్య నేర్చుట - అన్న వస్త్ర సంపాదనకే పశువుల సమకూర్చుకొనుట - ఉత్తమమైన పాడికే పెండ్లియాడుట - సంసారసౌఖ్యమునకే పుత్రులపోషణ - ఉత్తమగతికే సైన్యముసమకూర్చుట - శత్రుసంహారమునకే దానమిచ్చుట - ముందు జన్మలో పుణ్యముకొరకు నీయందు అనన్య భక్తి - ముక్తిని పొందుటకొరకే.

32. ధరణిలో వెయ్యేండ్లు తనువు నిల్వగఁబోదు, ధనమెప్పటికి శాశ్వతంబు గాదు,
దార సుతాదులు తనవెంట రాలేరు, భృత్యులు మృతినిఁ దప్పింపలేరు,
బంధుజాలము తన్ను బ్రతికించుకొనలేదు, బలపరాక్రమ మేమి పనికిరాదు,
ఘనమైన సకల భాగ్యంబెంతఁ గల్గియు గోచిమాత్రంబైనఁ గొంచుఁబోఁడు,
వెఱ్ఱికుక్కల భ్రమలన్ని విడిచి నిన్ను
భజనఁ జేసెడివారికి బరమ సుఖము;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహ ! ధరణిలో ఎవ్వరు వెయ్యేండ్లు జీవించరు, ధనముశాశ్వతమైనది కాదు, భార్య పిల్లలు నీవు చనిపోయాక నీ వెంట రారు. సేవకులు నీ మృతిని తప్పించలేరు, బంధువులు నిన్నుబ్రతికించుకొనలేరు, ఏ బలపరాక్రమ మేమి పనికిరాదు, ఘనమైన సకల భోగభాగ్యాలుఎంతఁ కల్గినా గోచిమాత్రంమైన కూడా రాదు. వెఱ్ఱికుక్కల వ్రంటి ఆలోచనలు వీడి, అశాశ్వతమయిన ప్రాపంచిక సుఖములమరచి శాశ్వతమయిన ముక్తికొరకు నిన్ను ప్రార్థించిన సుఖము కల్గును.

33. నరసింహ! నాకు దుర్గుణములే మెండాయె సుగుణ మొక్కటిలేదు జూడఁబోవ,
నన్యకాంతమీఁద నాశమానఁగలేను, ఒరుల క్షేమముఁజూచి యోర్వలేను,
ఇటువంటి దుర్బుద్ధులన్ని నాకున్నవి, నేనుఁ జేసెడివన్ని నీచకృతులు,
నావంటి పాపిష్టి నరుని భూలోకానఁ బుట్ట జేసితివేల? భోగిశయన!
అబ్జదళనేత్ర! నా తండ్రివైన ఫలము

నేరములు కాచి రక్షించు నీవె దిక్కు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహ! నాకు చెడు నడతలే ఎక్కువకాని, సుగుణ మొక్కటికూడాలేదు. పరస్త్రీలపై వ్యామోహము పోలేదు, ఇతరుల బాగు చూచి ఓర్వలేను, ఇటువంటి దురుభుద్దులన్ని నాకున్నవి, నేను చేసెడివన్ని నీచకార్యాలు, నావంటి పాపిష్టి నరుడు ఈ భూలోకంలో పుట్టలేదు. పన్నగశయన! కమలపత్రాక్షా! నా తండ్రివైన కారణంగా నా తప్పులన్నియు మరచి నన్ను రక్షింపుము తండ్రీ.

34. ధీరతఁ బరుల నిందింప నేర్చితిఁగాని తిన్నగా నినుఁ బ్రస్తుతింపనైతిఁ
బొరుగు కామినులందు బుద్ధినిల్పితిఁగాని నిన్ను సతతము ధ్యానింపనైతిఁ
బొరుగు ముచ్చటలైన మురిసి వింటినిగాని యెంచి నీకథలాలకించనైతి,
గౌతుకంబునఁ బాతకము గడించితిఁగాని హెచ్చు పుణ్యము సంగ్రహింపనైతి,
నవనిలో నేను జన్మించినందుకేమి
సార్థకము కానరాదాయె స్వల్పమైన,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

పరులను ధూషించడంలో నా సమయమంత వ్యర్థమైంది నిన్ను స్తుతింపలేదు. పొరుగు కాంతలపై బుద్ధినిల్పానిగాని నిన్ను ఎల్లవేళలా ధ్యానింపలేదు. పొరుగువారి బాతాఖాని మురిసివిన్నాను కాని నీ కథలాలకించలేదు, సంతోషంతో పాపమార్జించాను. పుణ్యము మాత్రము గ్రహింపలేదు, నవనిలో నేను జన్మించినందు సార్థక్యము కానరావటల్లేదు. ఓ పద్మనాభా!ఈ ప్రపంచమున పుట్టినందుకు ఈ ప్రపంచ ఈతి బాధలందు, విషయ ములందు తగులుకొని తపించుచుంటిని తండ్రీ.

35. అంత్యకాలమందు నాయాసమున నిన్ను ( దలఁతునో తలఁపనో? తలంతు నిపుడె,
నరసింహ! నరసింహ! నరసింహ! లక్ష్మీశ దానవాంతక! కోటి భానుతేజ!
గోవింద! గోవింద! గోవింద! సర్వేశ పన్నగాధిపఁ శాయి! పద్మనాభ
మధువైరి! మధువైరి! మధువైరి! లోకేశ నీలమేఘ శరీర! నిగమ వినుత!
ఈ విధంబున నీనామ మిష్టమగును
భజన సేయుచునుందు నా భావమందు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**నా చరమకాలమున నిన్ను తలపలేనేమో తండ్రీ నిరతము నీ నామముల తలచుకొం దును. నరసింహా! లక్ష్మీ రమణా! దానవాంతక, కోటి భానుతేజ, గోవింద, పద్మనాభ, వాసుదేవయనుచు నీనామములే స్మరించెదను.**

36. ఆయురారోగ్య పుత్రార్థ సంపదలన్ని కలుగఁజేసెడి భారగర్తవీవె,
చదువు లెస్సగ నేర్చి సభలో గరిష్ఠాది కార మొందించెడి ఘనుఁడ నీవె,
నడక మంచిది పెట్టి నరులు మెచ్చెదునట్టి పేరు రప్పించెడి పెద్దవీవె,
బలువైన వైరాగ్య భక్తి జ్ఞానములిచ్చి ముక్తిఁ బొందించెడు మూర్తివీవె;
అవనిలో మానవుల కన్ని యాసలిచ్చి
వ్యర్థులను జేసి తెలిపెడివాఁడవీవె;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**స్వామీ! ఆయుష్షు, ఆరోగ్యము, పుత్రులు, సంపదలు కలుగఁచేసెవాడివి నీవె , చదువు బాగుగ నేర్చి సభలలో కీర్తి ఆర్జించినా నీవె కారణం, మంచి నడత, మంచిపేరు, గొప్ప వైరాగ్యము, భక్తి, జ్ఞానములిచ్చి ముక్తినిచ్చే మూర్తివి నీవే; అవనిలో మానవులకన్ని ఆశలు కల్పించి వారిని వ్యర్థులను చేసేవాడివి కూడా నీవే; నా సర్వ శుభాశుభములకు నీవే కర్తవు. నీవే భోక్తవు. నీవే అన్నీ. ఒక్క నాకేయని ఏమిటి సర్వమానవాళి ఈ రీతిని వుం డుటకు నీవే కారణము.**

37. కాయమెంత భయానఁ గాపాడినంగాని ధాత్రిలో నది చూడ దక్కఁబోదు,
ఏవేళ నేరోగ మేమరించునొ? సత్త్వ మొందఁగఁ జేయు మే చందమునను,
ఔషధంబులు మంచి వనుభవించినఁ గాని కర్మ క్షీణంబైనఁగాని విడదు,
కోటివైద్యులు గుంపుగూడివచ్చినఁగాని మరణ మయ్యెడు వ్యాధి మాన్పలేరు,
జీవుని ప్రయాణ కాలంబు సిద్ధమైన
నిలుచునా దేహ మిందొక్క నిమిషమైన?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ నారసింహా! శరీరాన్ని ఎంత కాపాడినా అది నిలచేది కాదు. ఏవేళ ఏ రోగమొచ్చునో. ఎప్పడు నశించునో ఎవ్వరికి తెలియదు. మంచి ఔషధంబులు చేవించినా, కోటివైద్యు లు వెద్యులు వైద్యంచేస్తున్నా , రానున్న మంణానిన& ఆపలేరు, అశాశ్వతమయిన ఈ శరీ రమునెంత రక్షించిననూ, అంత్యకాలములో అది ఒకక్షణమైన నిలవదు.**

38. జందెమింపుగ వేసి సంధ్యవార్చిన నేమి బ్రహ్మమందక కాఁడు బ్రాహ్మణుఁడు;
తిరుమణి శ్రీచూర్ణ గురురేఖ లిడినను విష్ణు నొందక కాఁడు వైష్ణవుండు
బూదిని నుదుటను బూసికొనిన నేమి శంభు నొందకకాఁదు శైవజనుఁడు;
కాషాయ వస్త్రాలు కట్టి కప్పిన నేమి యాశ పోవక కాఁడు యతివరుఁడు;
ఇట్టి లౌకిక వేషాలు గట్టుకొనిన
గురునిఁ జెందక సన్ముక్తి దొరక బోదు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ లోకరక్షకా! జందెం చక్కగావేసుకొని వేసి సంధ్యవార్చినా బ్రహ్మను తెలుసుకోని వాడు బ్రాహ్మణుఁడు కాడు; చక్కటి పౌండ్రాలు ధరించినా విష్ణువుని తెలుసుకోక పోతే వైష్ణవు డు కాదు. విభూదిని నుదుటను పూసుకొన్నా శివుని తెలిసికొననివాడు శైవుడు కాడు; కాషాయ వస్త్రాలు కట్టినా ఆశాపాశంలో చిక్కుకున్నవాడు సన్యాసికాడు; పైపై పటాటోప**

ములు ఎన్ని వున్నను నిజమైన భక్తుడు కాకున్న సద్గురువు కాలేడు. అట్టి సద్గురువు లభించకున్న జీవన్ముక్తి లభింపదు.

39. నరసింహ! నే నిన్ను నమ్మినందుకుఁ నెసరు నాయందుంచు నెమ్మసమున,
నన్ని వస్తువులు నిన్నడిగి వేసటపుట్టె నింకనైఁన గటా క్షమియ్యవయ్య!
సంతసంబున నన్ను స్వర్గమందే యుంచు, భూమియందే యుంచు, భోగిశయన!
నయముగా వైకుంఠ నగరమందే యుంచు, నగరమందే యుంచు నళిననాభ?
ఎచట నన్నుంచినంగాని యెపుడు నిన్ను
మఱచిపోకుండ నామస్మరణ నొసఁగు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా! నే నిన్ను నమ్మినందుకుఁ నాయందు దయయుంచుము , అనేక వస్తువులు నిన్నడిగి వేసారి వున్నాను నన్ను క్షమియ్యవయ్యా! సంతోషంతో స్వర్గం ఉంచుతావో, భూమియందే ఉంచుతావో, వైకుంఠంలో ఉంచుతావో నీ యిష్టం. నిన్ను నమ్మినందుకు నాకు ఏలోకమున ఉన్నను నీ నామస్మరణ మరువకుండని వరమును ప్రసాదింపుము.

40. దేహమున్నవఱకు మోహ సాగరమందు మునుఁగుచుందురు శుద్ధ మూఢజనులు,
సలలితైశ్వర్యముల్ శాశ్వతంబనుకొని షడ్భ్రమలను మానవజాలరెవరు,
సర్వకాలము మాయ సంసారబద్ధులై గురుని కారుణ్యంబు గోరుకొనరు,
జ్ఞానభక్తి విరక్తులైన పెద్దలఁజూచి నిందఁ జేయక తాము నిలువలేరు,
మత్తులైనట్టి దుర్జాతి పెద్దలజూచి
నిన్ను ఁ గనలేరు మొదటికే నీరజాక్ష!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఈ మూఢజనులు దేహమున్నంత వఱకు మోహసాగరంలో మునుఁగుతూంటారు, ఐశ్వర్యములు శాశ్వతమనుకొని భ్రమకులోనవుతున్నారు, సర్వకాలము మాయ సంసార

బద్ధులై గురుని కరుణను కోరుకొనరు, జ్ఞానము, భక్తి లేక పెద్దలను నిందిస్తారు.నీరజాక్ష! ప్రాణమున్నంత కాలము అరిషడ్గములకు లోబడి నిన్ను మరచిన వారిని, యోగులను నిందించే మమ్ము రక్షింపుము.

41. ఇలలోన నే జన్మ మెత్తినప్పటినుండి బహు గడించితినయ్య పాతకములు,
తెలిసి జేసితిఁ గొన్ని, తెలియఁజాలక చేసి! బాధ నొందితినయ్య పద్యనాభ!
అనుభవించెడు నప్పుడతి ప్రయాసంబంచుఁ బ్రజలు చెప్పఁగ జాల భయముఁగలిగె,
నెరిగిపోవుటకునై యే యుపాయంబైనఁ జేసి చూతమటన్నఁ జేతఁగాదు,

సూర్యశశినేత్ర! నీ చాటుఁ జొచ్చినాఁడ,
కలుషములుద్రుంచి నన్నేలు కష్టమనక,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

పద్యనాభ! ఈ భూమిమీద జన్మమెత్తినప్పటినుంచి అనేక పాతకములు చేసాను. తెలిసి గొన్ని, తెలియక కొన్ని పాపాలుచేసాను. బాగ బాధ అనుభవించాను. ఓ సర్వసాక్షీ! నేనెన్ని పాపములు చేసితినో నీకే తెలియును. కాని నిన్ను నే నాశ్రయించుటచే నాపాపములు దహించి నన్ను కాపాడుము.

42. తాపసార్చిత! నేను పాపకర్ముడ నంచు నాకు వంకలబెట్టఁబోకుసుమ్మి,
నాఁటికి శిక్షలు నన్నుఁజేయుటకంటె నేఁడు సేయుము నీవు నే స్తమనక,
అతిభయంకరులైన యమదూతలకు నన్ను నొప్పగింపకుమయ్య యురగశయన!
నీ దాసులనుబట్టి నీవు దండింపంగ వద్దు వద్దన రెంత పెద్దలైన,
తండ్రివై నీవు పరపీడఁ దగులఁజేయ
వాసిగల పేరు కపకీర్తి వచ్చునయ్య,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

తాపసార్చిత! నేను పాపకర్ముడనని నాకు వంకలు పెట్టకు, ఎప్పడో శిక్షలువేయక నేడే శిక్షలు మైత్రితో విధించుము.  నా పాపములకు నన్ను యమభటులకు అప్పగించిన అది నీకే అపకీర్తి. నువ్వే నన్ను దండించిన అద నీకు, నాకు కూడా మేలు కలుగజే యును.

43. ధరిణిలోపల నేను తల్లి గర్భమునుండి పుట్టినప్పటినుండి పుణ్యమెఱుఁగ
నేకాదశీవ్రతం బెన్నఁడుండంగ లేదు, తీర్థయాత్రలకైన దిరుగలేదు,
పారమార్థికమైన పనులు సేయఁగలేదు, భిక్షమొక్కనికైనఁ బెట్టలేదు,
జ్ఞానవంతులకైనఁ బూని మ్రొక్కఁగలేదు, ఇతర దానములైన నీయలేదు,
నళినదళనేత్ర నిన్ను నే నమ్మినాను,
చేరి రక్షింపవే నన్ను శీఘ్రముగను,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ధరిణిలోపల నేను తల్లి గర్భమునుండి పుట్టినప్పటినుండి పుణ్యమెఱుఁగ నేకాదశీవ్రతం బెన్నఁడుండంగ లేదు, తీర్థయాత్రలకైన దిరుగలేదు, పారమార్థికమైన పనులు సేయఁగలే దు, భిక్షమొక్కనికైనఁ బెట్టలేదు, జ్ఞానవంతులకైనఁ బూని మ్రొక్కఁగలేదు, ఇతర దానము లైన నీయలేదు, నళినదళనేత్ర నిన్ను నే నమ్మినాను, చేరి రక్షింపవే నన్ను శఘ్రముగను, ఓ నారసింహా! జన్మ ఎత్తిన నాటి నుండి పాప కార్యముల చేసితినే కాని ఒక్క పుణ్యకార్య ము కూడా చేయలేదు. జ్ఞానులకయినా వందనము చేయలేదు. కాని నిన్ను మనసారా నమ్మి నందుకు నన్ను రక్షించు బాధ్యత నీదే.

44. అడవిపక్షుల కెవ్వఁడాహారమిచ్చెను? మృగజాతికెవ్వఁడు మేఁతఁబెట్టె?
వనచరాదులకు భోజన మెవ్వఁడిప్పించెఁ జెట్లకెవ్వఁడు నీళ్ళు చేఁదిపోసె?
స్త్రీ గర్భంబున శిశువు నెవ్వఁడు పెంచె? ఫణుల కెవ్వఁడు పోసె బరఁగఁబాలు
మదుపాళికెవ్వఁడు మకరంద మొనరించె? బసులకెవ్వడొసంగెఁ బచ్చిపూరి?
జీవకోట్ల బోషింప నీవెకాని.
వేఱె యొకదాత లేఁడయ్య వెదకిచూడ!

భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ప్రాణికోటిని పెంచి పోషించుట, సంహరించుట, సృష్టించుట అంతయూ నీవే కదా. కాబట్టి వారి పాప పుణ్యముల భారము కూడా నీవే.**

45. దనుజారి! నావంటి దాసజాలము నీకు కోటిసంఖ్య గలరు కొదువలేదు,
బంట్ల సందడివల్ల బహుపరాకై నన్ను మఱచి పోకుము భాగ్య మహిమచేత,
దండిగా భృత్యులు తగిలి నీకుండంగ ఒక్కబంటేపాటి పనికి నగును?
నీవు మెచ్చడి పనుల్ నేను జేయఁగలేక యింత వృథా జన్మ మెత్తినాను.
భూజనులలోన నే నప్రయోజకుఁడను
గనుక నీ సత్కాటాక్షంబు గలువఁజే;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**రాక్షసారి వగు నీకు లెక్కలేనంత మంది సేవకులు కలరు. సంపదల కధిదేవత యైనందున కూడా సేవకులు చాలామంది కలుగుదురు. కాని అత్యల్పుడు వయిననన్ను కూడా రక్షింపు భారము నీదే.**

46. కమలలోచన! నన్నుఁ గన్న తండ్రివి కాన నిన్ను నేమరకుంటి నేను విడక,
యుదర పోషణకునై యొకరి నే నాశింప నేర! నా కన్నంబు నీవు నడపు,
పెట్టలేనంటివా పిన్న పెద్దలలోనఁ దగవు కిప్పుడు దీయఁ దలఁచినాను,
ధనము భారంబైనఁ దలకిరీటములమ్ము, కుండలంబులు పైడి గొలుసులమ్ము,
కొసకు నీ శంఖచక్రముల్ కుదవఁ బెట్టి
గ్రాసము నొసగి పోషించు కపటముడిగి;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

కమలనేత్రా! నా తండ్రివైన నీవే నా పోషణ చూడవలెను. దానికి కష్టమైన నీ ఆభరణాదులను అమ్మియైన నన్ను పోషింపవలెను.

47. కువలయ శ్యామ! నీ కొలువు చేసిన నాకు జీతమెందుకు ముట్టఁ జెప్పవైతి?
మంచి మాటలచేతఁ గొంచెమీయఁగలేవు కలహమౌనిఁకఁ జుమ్మి ఖండితముగ,
నీవు సాధువుగాన నింత పర్యంతంబుచనువుచే నిన్నాళ్ళు జరుపవలసె,
నిఁక నే సహింప నీవిపుడు నన్నేమైన శిక్ష చేసినఁ జేయు సిద్ధమయితి.
నేఁడు కరుణింపకుంటివా నిశ్చయముగఁ
దెగఁబడితిఁ జూడు నీతోడ జగడమునకు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

కువలయశ్యామా! నీ సేవజేసినందుకు నాకు జీతభత్యములు ఈయకున్న కొట్లాడియైన తీసికొనగలను.

48. హరి! నీకుఁ బర్యంకమైన శేషుఁడు చాలఁ బవనము భక్షించి బ్రతుకుచుండు,
ననువుగా నీకు వాహనమైన ఖగరాజు గొప్పపాముసు నోఁటఁ గొఱకుచుండు,
నదిగాక నీభార్యయైన లక్ష్మీదేవి దినము పేరంటంబు దిరుగుచుండు;
నిన్ను భక్తులు పిల్చి నిత్య పూజలుచేసి ప్రేమఁ బక్వాన్నముల్ పెట్టుచుండ్రు,
స్పష్టముగ నీకు గ్రాసము జరుగుచుండఁ
గాను నీ చేతి దొకటైనఁ గాదు వ్యయము,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా! నీ చేతి దొక్కపైసాయైనను ఖర్చుకాకుండ నీ పాన్పయిన శేషుడు గాలి తిని బతుకును. గరుడుడు పాముల భుజించును. నీ భార్య పేరంటాలకు తిరుగును. నీ భక్తులు నీకు నిత్యపూజలు కావించి అన్నప్రసాదములు పెడుతురు. చింతలేకుండ నీకు, నీ భటులకు భుక్తి గడచిపోవును.

49. పుండరీకాక్ష! నా రెండు కన్నుల నిండ నిన్నుఁ జూచెడి భాగ్య మెన్నడయ్య!
వాసిగా నా మనోవాంఛ దీరెడునట్లు సొగసుగా నీరూపు చూపవయ్య
పాపకర్ముని కంటఁబడక పోవుదమంచుఁ బరుషమైన ప్రతిజ్ఞ బట్టినావె!
వసుధలో ఁ బతితపావనుఁడ వీవంచు నేఁ బుణ్యవంతుల నోటఁ బొగడ వింటి;
నేమిటికి విస్తరించె నీ కింతకీర్తి?
ద్రోహినైనను నాకీవు దొరకరాదె?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**నరసింహస్వామీ! నీ సుందరాకారము నా కన్నుల పడనీయవేమి? నేను పాపాత్ముడనని యా? నీకు కీర్తివల్ల అహంకారమెక్కువయ్యెను.**

50. పచ్చి చర్మపుఁదిత్తి పసలేదు దేహంబు లోపలనంతట రోయ రోఁత,
నరముల శల్యముల్ నవరంధ్రములు రక్త మాంసముల్ కండలు మైలతిత్తి,
బలువైన యెండవానల కోర్వదెంతైనఁ దాళలే దాఁకలి దాహములకు,
సకల రోగములకు సంస్థానమయియుండు నిలువ దస్థిరమైన నీటిబుగ్గ,
బొందిలోనుండి ప్రాణముల్ పోయినంతఁ
గాటికే కాని కొఱగాదు గవ్వకైన,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ నరసింహా! ఈ అశాశ్వతమయిన శరీరము పచ్చితోలు వంటిది. ప్రాణము పోయిన కాటికే తప్ప పనికిరాదు.**

51. బలురోగములకు నీ పాదతీర్థమె కాని, వలపు మందులు నాకు వలదు వలదు,
చెలిమి సేయుచు నీకు సేవ జేసెదగాని, నీ దానకోటిలో నిలువనయ్య,

గ్రహభయంబునకుఁ జక్రము దలంచెదఁగాని ఘోరరక్షలు గట్టఁగోరనయ్య,
పాము కాటుకు నిన్ను భజనజేసెదఁగాని దాని మంత్రము నేను తలపనయ్య,
దొరికితివి నాకు దండివైద్యుఁడవు నీవు,
వేయి కష్టాలు వచ్చిన వెఱవనయ్య,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ కష్టసంహారా! నాకెన్ని కష్టములు వచ్చినను నిన్ను తలతునే కాని ఏ వైద్యుని వద్దకు పోను నీ పాదములు కడిగిన నీరు ఏ వైద్యము చేయలేని పనిని చేయును. అది సర్వ రోగ నివారిణి. గ్రహముల బాధలకు రక్షరేకులు అవసరంలేదు నీ సుదర్శన చక్రము చాలు. పాముకాటువేస్తే నిన్ను స్మరిస్తాను గాని మంత్రలు వేయ్యను.నాకు పెద్దవైద్యుడవు నీవే వేయి కష్టాలువచ్చినా జంకను.**

52. కూటికోసరము నే గొరగాని జనులచేఁ బలుగద్దరింపులు పడఁగ వలసెఁ,
దారసుత భ్రమఁదగిలి యుండఁగఁ గదా? దేశ దేశములెల్లఁ, దిరుగవలసెఁ,
బెను దరిద్రతపైనిఁ బెనఁగి యుండగఁ గదా? చేరి నీచుల సేవఁ జేయవలసె,
నభిమానములు మదినంటియుండగఁ గదా? పరులఁజూచిన భీతిఁబడఁగ వలసె,
నిటుల సంసార వారధి నీఁద లేక
వేయి విధముల నిన్ను నే వేఁడుకొంటి ఁ
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**స్వామీ! భార్యా, పుత్రులు, ఉదర పోషణార్ధము యాచించ రాని వారిని యాచించి పడ రాని మాటలు పడవలసి వచ్చింది. సంసార సముద్రము నుండి నన్ను తరింప జేయుము స్వామీ**

53. సాధు సజ్జనులతో జగడమాడినఁ గీడు, కవులతో వైరంబుఁ గాంచఁ గీడు,
పరమదీనులఁ జిక్కఁబట్టి కొట్టినఁ గీడు, బిచ్చగాండ్రను దుఃఖపెట్టఁ గీడు,

నిజపేదలను జూచి నిందఁజేసినఁ గీడు, పుణ్యవంతులదిట్టఁ బొసగుఁ గీడు,
సద్భక్తులను దిరస్కారమాడినఁ గీడు, గురుని ద్రవ్యము దోచుఁకొనినఁ గీడు,
దుష్టకార్యము లొనరించు దుర్జనులకు
ఘనతరంబైన నరకంబు గట్టిముల్లె,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**నరకమనే మూటను సిద్ధము చేసికొన్న వారు ఉత్తములను దూషిస్తారు. చేజిక్కిన దీనులను దండింతురు. బిక్షకులను హేళన చేయుదురు. గురువుల ద్రవ్యము హరింప నన్ను అటువంటి పాపముల నుండి రక్షింపుము.**

54. పరుల ద్రవ్యముమీఁద భ్రాంతినొందినవాఁడు, పరకాంతల నపేక్ష పడెడువాఁడు,
అర్థులవిత్తంబు లవహరించెడువాఁడు, దానమీయంగ వద్దనెడువాఁడు,
సభలోపల నిల్చి చాడి చెప్పెడివాఁడు పక్షపు సాక్ష్యంబు పలుకువాఁడు,
విష్ణుదాసులఁ జూచి వెక్కిరించెడువాఁడు, ధర్మసాధులఁ దిట్టఁ దలచుఁవాఁడు,
ప్రజల జంతుల హింసించు పాతకుండు
కాలకింకర గదలచేఁ గష్టమొందు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**పరస్త్రీలపై మోజుకలవారు నపేక్ష పడెడువారు, దానమిస్తోంటే అడ్డుపడేవారు, ధర్మసాధులను తిట్టదలచేవారు, ప్రజలను, జంతువులను హింసించే పాతకులు. పరుల సొమ్ముకు ఆశపడువారు. సభలలో చాడీలు చెప్పదురు. విష్ణు భక్తులను తిట్టుదురు. కాలకింకరుల గదలచే కష్టాలుపొందుతారు,**

55. నరసింహ! నా తండ్రి నన్నేలు నన్నేలు, కామితార్థము లిచ్చికావుకావు,
దైత్య సంహార! చాల దయయుంచు దయయుంచు, దీనపోషక! నీవె దిక్కు దిక్కు,
రత్నభూషిత వక్ష! రక్షించు రక్షించు, భువన రక్షక! నన్ను ( బ్రోవు, బ్రోవు,

మారకోటిసురూప! మన్నించు మన్నించు, పద్మలోచన చేయిఁ బట్టు పట్టు,
సుర వినుత! నేను నీచాటు జొచ్చినాను,
నా మొఱాలించి కడతేర్చు నాగశయన!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా! నా తండ్రి నన్నేలు నన్నేలు, కామితార్థము లిచ్చి కావుమయ్యా, దైత్య సంహార! మాపై చాల దయయుంచు మయ్యా, దీనపోషక! నీవె దిక్కు స్వామీ, రత్నభూషిత వక్ష! రక్షించు మయ్యా, భువన రక్షకా! నన్ను బ్రోవుము ! నా మొరాలించి కడతేర్చుము. ఈ పద్యములో స్వామి వివిధ నామములను స్మరించి కవి పదేపదే శరణాగతి కోరు చున్నాడు.

56. నీ భక్తులను గనుల్ నిండ జూచియు రెండు చేతుల జోహారు చేయువాఁడు
నేర్పుతో నెవరైన నీ కథల్ చెప్పంగ వినయమందుచుఁ జాల వినెడివాఁడు,
తన గృహంబునకు నీ దాసులు రా జూచి పీటపైఁ గూర్చుండఁ బెట్టువాఁడు,
నీ సేవకుల జాతి నీతులెన్నక చాల దాసోహమని చేరఁదలచువాఁడు,
పరమభక్తుండు ధన్యుండు భానుతేజ!
వానిఁ గనుఁగొన్న బుణ్యంబు వసుధలోన,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ భానుతేజ!నీ భక్తులను చూచి రెండు చేతులతో నమస్కరించువాఁడు, నేర్పుతో నీ కథల్ చెప్పగా వినయముతో వినేవాఁడు, తన గృహమునకు నీ దాసులు వస్తే పీటపై కూర్చుండపెట్టువాఁడు, నీ సేవకులలో కులగోత్రాలెంచక దాసోహమని వారిని చేరిన వాడు, పరమభక్తుడు. ధన్యుడు నీ భక్తుల గొప్పతనము తెలుసుకొన్నచో పుణ్యము , నరసింహా! నిన్నే గాక నీ భక్తులను కొలిచినా మోక్షము కలుగును కదా స్వామీ

57. పక్షివాహన! నేను బ్రతికినన్ని దినాలు కొండెగాండ్రను గూడి కుమతినైతి
నన్న వస్త్రములిచ్చి యాదరింపుము నన్నుఁ గన్నతండ్రివి నీవె కమలనాభ!
మరణమయ్యెడి నాఁడు మమతతో నీయొద్ద బంట్లో దోలుము ముందు బ్రహ్మజనక!
యినజభటావళి యీడిచికొనిపోక కరుణతో నాయొద్దఁగావలుంచు,
కొనకు నీ సన్నిధికిఁ బిల్చుకొనియు నీకు
సేవకుని జేసికొనవయ్య శేషశయన!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

పక్షివాహనా! నేను బ్రతికినన్నాళ్లు చాడీలుచెప్పేవారిని కూడి చెడ్డస్వభావము కలవాడ నయ్యాను. ఓ కమలనాభ! నన్నుఁ కన్నతండ్రివి అన్న వస్త్రములిచ్చి యాదరింపుము మరణమసమయములో మమతతో నీ సేవకులను పంపి నన్ను యమభటు యీడ్చుకు పోకుండా కాపాడి, ఆఖరున నీ సన్నిధికిఁ పిల్చుకొనిపోయి నీకు సేవకుని జేసికొన వయ్యి శేషశయన! నేనెంత దుర్మార్గుడయినను నన్ను బ్రోచుభారము నీదే.

58. నిగమాది శాస్త్రముల్ నేర్చిన ద్విజుఁడన, యజ్ఞకర్తగు సోమయాజినైన,
ధరణిలోపలఁ బ్రభాతస్నాన పరుఁడైన, నిత్య సత్కర్మాది నిరతుఁడైన,
ఉపవాసనియమంబున్ బంధు సజ్జనుఁడైన గాని వస్త్రముఁ గట్టు ఘనుఁడునైన,
దండి షోడశమహాదాన పరుండైన, సకలయాత్రలు సల్పు సరసుఁడన;
గర్వమునఁ గష్టపడి నిన్నుఁ గానకున్న
మోక్షసామ్రాజ్య మొందఁడు మోహనాంగ!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా! నిగమాది శాస్త్రముల్ నేర్చిన బ్రాహ్మణుడనా, యజ్ఞములు చేసిన సోయమా జియైనా, ప్రభాతమున స్నానము చేసేవాడైనా, నిత్య సత్కర్మలు ఆచరించు వాడైనా, ఉప వాసనియమములు పాటించువాడైనా, బంధు సజ్జనుడైనా, కాషాయవస్త్రము కట్టిన వా

డైనా, వక్కువ షోడశమహాదానలు చేసినవాడైనా, తీర్థయాత్రలు వాడైనా అహంకారి యైతే మాత్రము నీకు పరమ భక్తుడైనను ముక్తిని పొందలేడు.

59. పంజరంబుఁ గాకి బట్టియుంచిన లెస్స పలుకునే వింతైనఁ జిలుకవలెను?
గార్ధభంబును దెచ్చి కళ్ళెమింపుగ వేయ దిరుగునే గుఱ్ఱంబు తీరుగాను?
ఎనుబోతు నొగి మావటీఁడు శిక్షించిన నడచునే మదవారణంబువలెను?
పెద్ద పిట్టకు మేఁతఁబెట్టి పెంచినఁ గ్రొవ్వి సాగునే వేఁటాడు డేఁగవలెను?
కుజనులను దెచ్చి నీ సేవకొఱకుఁ బెట్ట
వాంఛతో ( జేతురే భక్తపరుల వలెను?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

దుష్టజనము భక్తశ్రేష్టుల వలె నీకు సేవ చేయలేరు. అది ఎట్లన పంజరమున కాకి, గాడిదకు కళ్లెము, దున్నపోతుకు ఏనుగు నడక, పెద్దపిట్టకు డేగవలె వేట రావు కదా. చెడ్డవారిని నీ సేవకొరకు పెడితే వారు భక్తపరులా భక్తితో  సేవలు చేయరు కదా!

60. నీకు దాసుఁడనంటి నిన్ను నమ్మికయుంటిఁ గాన నాపై నేఁడు కరుణజూడు
దోసిలొగ్గితి నీకు ద్రోహమెన్నగఁబోకు, పద్మలోచన! నేను బరుఁడగాను
భక్తి నీపైనుంచి భజన జేసెదఁగాని, పరులవేఁడను జుమ్మి వరములిమ్ము,
దండి దాతవు నీవు తడవు సేయకకావు, ఘోర పాతక రాశిఁ గొట్టివైచి,
శీఘ్రముగఁ గోర్కు లీడేర్చు చింతదీర్చు,
నిత్యమును నన్నుఁ బోషించు, నెనరునుంచు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా! నీకు దాసుఁడనై నిన్ను నమ్ముకుని యున్నాను.  నాపై కరుణచూపుము నీకు దోసిలొగ్గాను. తప్పలెంచకు స్వామీ! పద్మలోచన! నేను పరుడగాను నీపై అపారమైనభక్తి నుంచి భజన చేసాను,నాకు వరములిమ్ము,నీవు గొప్ప దాతవు ఆలస్యం చేయకు,

నేను చేసిన ఘోర పాపాలరాశిని తొలగించి శీఘ్రముగ నా కోర్కులీడేర్చు. నా విచార ముతీరుమ్చు, అనునిత్యమును నన్నుఁ పోషించు, అన్యధా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ, అని ప్రార్థిస్తున్నాను.

61. విద్యనేర్పితినంచు విఱ్ఱవీగంఁగ లేదు, భాగ్యవంతు డనంచుఁ బలకలేదు,
ద్రవ్యవంతుఁడనంచు దరచుఁ నిక్కఁగలేదు, నియతి దానములైన నెఱపలేదు,
పుత్రవంతుఁడనుంచు బొగడుచుండఁగలేదు, భృత్యవంతుఁడ నంచు బెగడలేదు,
శౌర్యవంతుఁడ నంచు సంతసింపఁగలేదు, కార్యవంతుఁడనంచుఁ గడపలేదు,
నలుగురికి  మెప్పుగానైన నడవలేదు,
నళినదళనేత్ర! నిన్ను నే నమ్మినాను,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

విద్యనేర్పితినని, భాగ్యవంతుడనని, ద్రవ్యవంతుడనని, నియతి దానములు చేసానని, పుత్రవంతుఁడనని, శౌర్యవంతుఁడ నని, కార్యవంతుడనని పొంగి పోలేదు. నళినదళనేత్ర! నిన్ను నే నమ్మినాను, నళినగళనేత్ర, నేనెన్నడు ఆత్మస్తుతి చేసు కొనలేదు.నిన్నే స్తుతించు చుంటిని.

62. అతిలోభులను భిక్ష మడుగ బోవుట రోఁత తనద్రవ్య మొకరింట దాఁచ రోఁత,
గుణహీనుఁడగువానిని కొలువుఁగొల్చుట రోఁత, యొరుల పంచలక్రింద నుండ రోఁత,
భాగ్యవంతుని తోడఁ బంతమాడుట రోఁత, గుఱిలేని బంధులఁ గూడ రోఁత
యాదాయములు లేక యప్పుదీయుట రోఁత, జారచోరుటఁ గూడి చనుట రోఁత
యాదిలక్ష్మీశ! నీ బంట నైతినయ్య
యింక నెడఁబాపు జన్మం బదెన్న రోఁత,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

లక్ష్మీనాథా! అతిలోభులను దానమడుగట,  తనద్రవ్య మొకరింట దాచుట, గుణహీనుని కొలువుండుట, ఒరుల పంచలక్రిందఉండుట, భాగ్యవంతునితోడఁ పంతములాడుట, విశ్వాసములేని బంధువుల ఉండుట, ఆదాయములు లేక అప్పుపెట్టుట, వ్యభిచారులతో, చోరులతో తిరుగుట అసహ్యమైన పని. ఈ పాపపులోకంలో పుట్టుక, జనుల పాపచింత న వీని నన్నింటిని రోసి ముక్తిని కోరుచుంటిని. నాకు పునర్జన్మ వలదు స్వామీ.

63. వెఱ్ఱివానికి నేల వేదాక్షరంబులు? మోటువానికి మంచి పాటలేల?
పసులఁగాపరికేల పరతత్త్వ బోధలు? విటగాని కేటికి విష్ణుకథలు?
వదరు శుంఠకేల వ్రాఁత పుస్తకములు? తిరుగుఁ దిమ్మరికేల దేవపూజ?
ద్రవ్యలోభికి నేల దాతృత్వ గుణములు? దొంగబంటుకు మంచి సంగేతేల?
క్రూరజనులకు నీమీఁదఁ గోరికేల?
ద్రోహి పాపాత్మునకు దయా దుఃఖమేల?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహస్వామీ!  వేదాక్షరములు తెలివిలేని వానికి, మంచిమాటలు మొరటువానికి, ప శువుల కాపరికి దైవ చింతన, విష్ణుకథలు, వ్యభిచారికి, లోకసంచారికి దైవపూజ, శుంఠలకు పుస్తకములు, లోభికి దాతృత్వము? దొంగకు మంచి మాటలు, ఎందుల కయా స్వామీ.

64. నా తండ్రి, నా దాత! నా యిష్టదైవమా! నన్ను మన్ననసేయు నారసింహ!
దయయుంచు నామీఁద దప్పులన్ని క్షమించి నిగమగోచర! నాకు నీవె దిక్కు,
నే దురాత్ముఁడనంచు నీ మనంబునఁ గోపగింపఁబోకుము స్వామీ! కేవలముగ,
ముక్తిదాయక! నీకు మ్రొక్కినందుకు నన్నుఁ  గరుణించు రక్షించు కమలనాభ!
దండి దొరవంచు నీ వెంటఁ దగిలినాను
నేఁడు ప్రత్యక్షమై నన్ను నిర్వహింపు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నా తండ్రి, నా దాత! నా యిష్టదైవమా! నన్ను మన్ననచేయుమయా నారసింహా! దయ యుంచుమయా నా తప్పులన్ని క్షమింముస్వామీ నిగమగోచర! నాకు నీవె దిక్కు, నేను దురాత్ముడననీ కోపగింప బోకుము స్వామీ!నీకు మ్రొక్కిన నన్ను  కరుణించి రక్షించు కమలనాభ! గొప్ప దొరవంచు నీ వెంట దగిలినాను నేఁడు ప్రత్యక్షమై నన్నునిర్వహింపు, పిలచినా పలుకవేలయా స్వామీ. శరణంటిని కాపాడు దేవా!.

65. వేమాఱు నీ కథల్ వినుచు నుండెడివాఁడు పరుల ముచ్చటమీఁద భ్రాంతిపడఁడు,
అగణితంబుగ నిన్నుఁ బొగడనేర్చినవాఁడు చెడ్డమాటల నోటఁజెప్పఁబోడు
ఆసక్తిచేత నిన్ననుసరించెడివాఁడు ధనమదాంధుల వెంటఁ దగులఁబోడు,
సంతసంబున నిన్ను స్మరణఁజేసెడివాఁడు చెలఁగి నీచులపేరు దలఁపబోఁడు
నిన్ను నమ్మిన భక్తుండు నిశ్చయముగఁ
గోరి చిల్లర వేల్పులఁ గొల్వబోడు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా!  నీ కథలు వేనకువేలు వినువాడు పరుల ముచ్చట మీద భ్రాంతిపడఁడు, అసంఖ్యాకముగ నిన్నుఁ పొగడువాఁడు చెడ్డమాటల నోటజెప్పడు. ఆసక్తితో నిన్ననుసరించెడివాఁడు ధనమదాంధుల వెంటబోడు, సంతసంబున నిన్ను స్మరించెడివాడు చెలఁగి నీచులపేరు తలపడు.'అన్యదైవము తలువ, నీదుపాదము విడువ' నన్ను కాపాడు స్వామీ.

66. నేనెంత వేఁడిన నీకేల దయరాదు? పలుమాఱు పిలిచినఁ బలుకవేమి?
పలికిన నీకున్న పదవేమి పోవును? మోమైనఁబొడచూపవేమి నాకు?
శరణుఁజొచ్చినవాని సవరించవలెఁగాక పరిహరించుట నీకు బిరుదుగాదు,
నీ దాసులకు నీవు నిర్వహింపక యున్న ఁ బరులెవ్వరగుదురు పంకజాక్ష?
దాత దైవంబు తల్లియు దండ్రినీవె,
నమ్మియున్నాను నీపాద సలిలమును,

భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ పంకజాక్ష! ఇంతగా వేడుకుంటూంటే నీకేందుకు దయరావటంలేదు? అనేకమాఱ్లు పిలిచినా పలుకవెందుకు? పలికితే నీ పదవేమైనా పోతుందా? నీ మోమైన నాకు చూపవేమి ? శరణుజొచ్చినవాని అనుగ్రహించాలి కాని నిర్లక్ష్యం చేయటం నీకు తగిన విధంగాలేదు, నీ దాసులనూ నీవు కాక వేరెవ్వరురక్షిస్తారు.? దాత దైవంబు తల్లియు దండ్రినీవె, నమ్మియున్నాను నీపాదపంకజములను, పదే, పదే నిన్నే పిలచి చులకనైతినా స్వామీ! ఏలనా మొర వినవు.

67. వేదముల్ చదివెడు విప్రవర్యుండైన రణము సాధించెడు రాజులైన,
వర్తక కృషికుఁడౌ వైశ్య ముఖ్యుండైనఁ బరిచరించెడి శూద్రవర్యుడయిన,
మెచ్చు ఖడ్గముఁ బట్టి మెఱయు మ్లేచ్చుండైన, బ్రజల కక్కఱపడు రజకుఁడైన,
చర్మమమ్మెడు హీన చండాల నరుఁడైన, నీ మహీతలమందు న్వేఁడైన,
నిన్ను ఁ గొనియాడుచుండెనా నిశ్చయముగ
వాఁడు మోక్షాధికారి యీ వసుధలోన;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

వేదములు చదివే విప్రవర్యుండైనా, రణము సాధించెడు రాజైనా, వర్తకుడైనా, శూద్రుడైనా, మ్లేచ్చుండైనా, చాకలివాడైనా, చర్మమమ్మెడు హీన చండాలుడైనా, ఈ మహీతల ములో వేరే చింత లేక నిన్నే కొలుచువానిని ఏకులమునకు చెందిన వాడైనను రక్షింతువు.

68. సకల విద్యలు నేర్చి సభ జయింపఁగ వచ్చు, శూరుఁడై రణమందుఁ బోరవచ్చు,
రాజరాజైనపుట్టి రాజ్య మేలఁగవచ్చు, హేమ గోదానంబు లియ్యవచ్చు,
గగనమందున్న చుక్కల నెంచఁగావచ్చు జీవరాసుల పేర్లు చెప్పవచ్చు,
నష్టాంగయోగంబు లభ్యసింప వచ్చు, కఠినమౌ రాల మ్రింగంగవచ్చు,

తామరసగర్భ హరపురందరులకైన
నిన్ను వర్ణింపఁ దరమౌనె నీరజాక్ష!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నీరజాక్ష! ఎన్నో విద్యలు నేర్చి సభలందు ప్రశంసలు పొందవచ్చు, శూరత్వముతో యుద్ధము చేయవచ్చు, రాజుగా పుట్టి రాజ్యాలు ఏల వచ్చు, బంగారము మొదలైన దివ్య దానములీయవచ్చు, ఆకాశంలో చుక్కల్నికూడా లెకించ వచ్చు, సమస్త జీవరా శులను పేరు పేరుగా చెప్పవచ్చు, అష్టాంగ యోగము సాధించ వచ్చు, కఠినమైన రాళ్లను మింగవచ్చు. కానీ నీ పరిపూర్ణ రూపము వర్ణించుట ఎవరికిని సాధ్యము కాదు.

69. నరసింహా! నీవంటి దొరను సంపాదించి, కుమతిమానవుల నేఁ గొల్వజాల,
నెక్కువైశ్వర్యంబు లియ్యలేకున్నను బొట్టకు మాత్రము పోయరాదె?
ఘనముగాదిది నీకుగరుణ బోషింప, గష్ట మెంతటి స్వల్ప కార్యమయ్య?
పెట్టఁజాలక యేల భిక్షమెత్తించెదు, నన్ను బీదనుజేసినావదేమి?
విమల! కమలాక్ష! నేనిట్లు శ్రమపడంగఁ
గన్నులకుఁ బండువై నీకుఁ గానఁబడునె?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నరసింహా! నీవంటి దొరను సంపాదించాక, దుష్టమానవుల నేనిక కొల్వను. ఎక్కువ ఐశ్వర్యం ఇయ్యకున్నా పొట్టకు మాత్రము సరిపడా ఇవ్వచ్చుకదా?నీకు ఘనము కాదిది స్వామీ. కరుణతో పోషించవయ్యా! నాకు పెట్టకుండా నాచేత బిచ్చమెత్తిస్తున్నావు కదా! నన్ను బీదవానిగా చేసావు కదా? నీ వంటి ప్రభువును పొందికూడా పొట్టకూటికై ఇత రుల నాశ్రయించుమనెద వేల? నాకింత కూడు పెట్టుట నీకు కష్టమా! నన్నీ విధంగా శ్రమపెట్టుట నీకు ఆనందమా.

70. వనరుహనాభ! నీ వంకఁ జేరితి నేను, గట్టిగా ననుఁ గావు; కావు మనుచు
వచ్చినందుకు వేగ వరము లీయకకాని లేవబోయిన నిన్ను లేవనియ్యఁ
గూర్చుండఁబెట్టి నీ కొంగు గట్టిగఁబట్టి పుచ్చుకొందును జూడు భోగిశయన
యీవేళ నీకడ్డ మెవరు వచ్చినఁగాని వారికైనను లొంగి వణఁకబోను,
కోపగాఁడవు నీవు నా గుణముఁ దెలిసి
యిప్పుడే నన్ను రక్షించి యేలుకొమ్ము,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ పద్మనాభ! నీ వంకజేరి నేను, గట్టిగా నన్ను కావుము; కావుమనుచు వచ్చినందుకు వేగముగా వరములీయకుండా లేవబోయిన నిన్ను లేవనియ్యను కూర్చుండబెట్టి నీ కొంగును గట్టిగ పట్టిపుచ్చుకుంటానును.యీవేళ నీకడ్డ మెవరు వచ్చినా,వారికి లొంగి వణకబోను, నేను పంతము పట్టియైన నీ వద్ద వరములు పుచ్చుకొనక మానను.

71. ప్రహ్లాదుఁడేపాటి పైఁడి కానుకలిచ్చె? మదగజం బెన్నిచ్చె మౌక్తికములు?
నారదుండెన్నిచ్చె నగలు రత్నంబు? లహల్య నీకే యగ్రహారమిచ్చె?
నుడుత నీకేపాటి యూడిగంబులు చేసె? ఘన విభీషణుఁ డేమి కట్నమిచ్చె?
పంచపాండవులేమి లంచమిచ్చిరి నీకు? ద్రౌపది నీ కెంత ద్రవ్యమిచ్చె?
నీకు వీరందఱయినట్లు నేను గాక
యెందుకని నన్ను రక్షింప విందునదన!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా! ప్రహ్లాదుడు నీ కెంత బంగారము ఇచ్చినాడు? గజేంద్రుడు ఎన్ని ముత్యాలిచ్చాడు? నారదుడు ఎన్ని నగలు, రత్నములిచ్చాడు? అహల్య, ఉడుత, విభీషణుడు, పంచ పాండవులు ద్రౌపది మొదలగు వారు నీకేమి మేలుచేసారి? ఇంతమందికి అనేకసౌకర్యములను కూర్చువాడవే. నన్నేల రక్షింపవు.

72. వాంఛతో బలి చక్రవర్తి దగ్గఱఁజేరి భిక్షమెత్తితివేల బిడియపడక?
యడవిలో శబరి తియ్యని ఫలాలందియ్యఁ జేతులొగ్గితివేల సిగ్గుపడక!
వేడ్కతో వేవేగ విదురునింటికి నేఁగి విందుగొంటివదేమి వెలితిపడక?
నటుకులల్పము కుచేలుఁడు గడించుక చేర బొక్కసాగితివేల లెక్కగొనక?
భక్తులకు నీవు పెట్టుట భాగ్యమౌను,
వారికాశించితివి తిండివాఁడవగుచు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఏమయ్యా నారసింహా! తిండి పోతువలె బలి చక్రవర్తిని, శబరిని, విదురుని, కుచేలుని ఎందుకని యాచించావు. నీ భక్తులకు నీవే పెట్టాలి. వారిని యాచించుట ఏమి న్యాయము.**

73. స్తంభమందుదయించి దానవేంద్రునిఁ ద్రుంచి కరుణతోఁ బ్రహ్లాదుఁ గాచినావు;
మకరిచేఁ జిక్కి సామజము దుఃఖింపంగఁ గృపయుంచి వేగ రక్షించినావు;
శరణంచు నవ్విభీషణుడు నీ చాటున వచ్చినప్పుడె లంకనిచ్చినావు;
ఆ కుచేలుఁడు చేరె డటుకులర్పించిన బహుసంపదలిచ్చి పంపినావు;
వారివలె నన్ను, బోషింప వశముగాదె
యింతవలపక్షమేల? శ్రీకాంత! నీకు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**శ్రీనాథా! ప్రహ్లాదుని హిరణ్యకశిపుని బారి నుండి, ఏనుగును మొసలి నోటి నుండి, కుచేలుని దారిద్ర్యము నుండి కాపాడినట్లే నన్ను కూడా కాపాడుము.**

74. వ్యాసుఁడేకులమందు వాసిగా జన్మించె? విదురుఁడేకులమందు వృద్ధిబొందె?
కర్ణుడేకులమందు ఘనముగా వర్ధిల్లె? నా వసిష్టుడెందు నవతరించె?
నింపుగా వాల్మీకి యే కులంబునఁబుట్టె? గుహు డను పుణ్యు డేకులమువాఁడు?

శ్రీశుకుఁడెచ్చటఁజెలఁగి జన్మించెను? శబరి యే కులమందు జన్మమొందె?
నే కులంబున వీరందఱొచ్చినారు?
నీ కృపాపాత్రులకు జాతి నీతులేల?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ దయాళూ! నీ కృపకు జాతి, మత, నీతి బేధములు లేవని విదురుడు, వ్యాసుడు, కర్ణుడు, వశిష్టుడు, వాల్మీకి, గుహుడు, శబరి మొదలగువారు సూచించుచున్నారు.**

75. వసుధాస్థలంబున వర్ణహీనుఁడుగాని, బహుళ దురాచారపరుఁడుగాని,
తడసి కాసియ్యని ధర్మశూన్యుఁడుగాని, చదువనేరని మూఢజనుఁడుగాని,
సకల మానవులు మెచ్చని కృతఘ్నుఁడుగాని, చూడసొంపును, లేని శుంఠగాని,
యప్రతిష్టలకు లోనైన దీనుడుగాని, మొదటి కేమెఱుగని మోటుగాని
ప్రతిదినము నీదుఁ భజనచేఁ జరఁగునట్టి
వానికేవంకలేదయ్య, వచ్చు ముక్తి;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**వసుధాస్థలంబున వర్ణహీనుఁడుగాని, బహుళ దురాచారపరుఁడుగాని, తడసి కాసియ్యని ధర్మశూన్యుఁడుగాని, చదువనేరని మూఢజనుడుగాని, సకల మానవులు మెచ్చని కృతఘ్నుఁడుగాని, చూడసొంపు లేని శుంఠగాని, అప్రతిష్టలకు లోనైన దీనుడుగాని, ఏమెఱుగని మోటుగాని, అనుదినము నీ నామస్మరణ చేసిన వానికి, అంత్యజుపైన, అధికుడయినను పరమపదమే లభించును.**

76. ఇభకుంభములమీఁది కెగిరెడి సింగంబు ముట్టునే కుఱుచైన మూషికమును?
నవచూతపత్రముల్ నమలెడి కోయిల కొఱకునే జిల్లేడు కొనలు నోట?
నరవింద మకరంద మనుభవించెడి తేఁటి పోవునే పల్లేరు పూలకడుకు?
లలితమైన రసాల ఫలముకోరెడి చిల్క మెసవునే భ్రమరె నుమ్మెత్తకాయ?

నిలను నీ కీర్తనలు పాడ నేర్చినతఁడు
పరుల కీర్తనఁబాడునే యరసి చూడ?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహస్వామీ!ఏనుగు కుంభస్థలము పైకి దూకు సింహము ఎలకమీదికి వెళు తుందా. లేతమామిడి ఆకులుతినే కోయిల జిల్లేడు ఆకులు తింటుందా? పూలమంకరం దము చవి చూసే తుమ్మెద పల్లేరు పూలపైకి పోతుందా? చక్కటిరుచిగల పళ్ళుతినే చిలుక నీ ఉమ్మెత్తకాయ తింటుందా? నామస్మరణ మీద ఇచ్ఛగల భక్తులకు ఇతరము లేవీ రుచించవు.
మందార మకరంద... పద్య భావము సూచితము.

77. సర్వేశ! నీ పాద సరసిజ ద్వయమందుఁ జిత్తముంచగఁలేను జెదరకుండ,
నీవైన దయయుంచి నిలచియుండెడునట్లు చేసి నన్ని పుడేలు, సేవకుఁడను,
వనజలోచన! నేను వట్టి మూర్ఖుడ జుమ్మి, నీ స్వరూపముఁజూడ నేర్పు వేగ,
తన కుమారుల కుగ్గు తల్లి పోసినయట్లు భక్తిమార్గంబను పాలుపోసి,
ప్రేమతో నన్నుఁ బోషించి పెంచుకొనుము
ఘనతఁకెక్కించు నీ దాస గణములోన,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

సర్వేశా! నీ పాదపద్మములపై నా మనస్సుకు ఏకాగ్రత కలుగటల్లేదు. నా చిత్తము నీయం దే ఏకాగ్రముచేయుము. నీ దర్శనభాగ్యము కలిగేటట్లు నాకు మార్గము చూపుము. తల్లి తన పిల్లలకు ఉగ్గుపాలుతో అన్నీ నేర్పేమాదిరగా మాకు భక్తిమార్గము చూపుము.నీ భక్తు లలో అగ్రగణ్యుడనగునట్లు ఆశీర్వదింపుము.

78. జీమూతవర్ణ! నీ మోముతో సరిరాక కమలారి యతికళంకమునుఁ బడసె,
సొగసైన నీ నేత్ర యుగముతో సరికాక, నళిన బృందము నీళ్ళ నడుమఁజేరెఁ,

గరిరాజవరద! నీ గళముతో సరిరాక పెద్ద శంఖము బొబ్బ పెట్టఁ దొడఁగె,
శ్రీపతి! నీ దివ్యరూపుతో సరిరాక పుష్పబాణుఁడు నీకుఁ బుత్రుఁడయ్యె,
నిందిరాదేవి నిన్ను మోహించి విడక
నీకుఁ బట్టంపు సతియయ్యె నిశ్చయముగ,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహస్వామీ! నీ మోముతో సరితూగలేక చంద్రుడు మచ్చకలవాడయ్యాడు. నీ నేత్రములతో పోటిపడలేక కలువలు నీళ్ళలో దాక్కుంటున్నాయి. నీ కంఠముతో సరిరాక శంఖము పెడబొబ్బలు పెడుతోంది నీరూపమునకు సాటి, పోటీ ఎవరూ లేరు. అందుకే లక్ష్మీదేవి నిన్ను మోహించి పెండ్లాడెను. అందుకే మన్మధుడు నీకు కొడుకాయెను.

79. హరిదాసులను నిందలాడకుండినఁజాలు సకల గ్రంధమ్ములు చదివినట్లు,
భిక్షమియ్యంగఁ దప్పింప కుండినఁ జాలుఁ జేముట్టి దానంబు చేసినట్లు,
మించి సజ్జనుల వంచించకుండినఁ జాలు నింపుగా బహుమాన మిచ్చినట్లు,
దేవాగ్రహముల్ దీయకుండినఁ జాలుఁ గనక కంబపు గుళ్ళు గట్టినట్లు,
ఒకరి వర్ణాశనము ముంచకున్నఁ జాలుఁ
బేరు కీర్తిగ సత్రముల్ పెట్టినట్లు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నీ నామస్మరణమున్నప్పుడు ఏ కొంచెమైననూ అధికస్య ఫలము నిచ్చును. విష్ణ భక్తుల ను నిందించనపుడు నీ గ్రంధములన్నియు చదివిన ఫలము కల్గును. దానము నడ్డగింపక యునప్పుడు దానము చేసినట్లే సజ్జనులను మోసగించక యున్న బహుమతులిచ్చినట్లే. దేవమాన్యాలను అపహరించకున్న దేవాలయములు కట్టినట్లే.

80. ఇహలోక సౌఖ్యమ్ము లిచ్చగించెదమన్న దేహ మెప్పటికిఁదా స్థిరత నొంద,
దాయుష్యమున్న పర్యంతంబు పటుతయు నొక్కతీరుననుండ దుర్వ్యిలోన

బాల్యయౌవన సుదుర్బల వార్థక్యములను మూఁటిలో మునిఁగెడి ముఱికి కొంప,
భ్రాంతితో దీని గాపాడుద మనుకొన్న ఁ గాలమృత్యువుచేతఁ గోలుపోవు,
నమ్మరాదయ్య! యిది మాయ నాటకంబు;
జన్మమిఁక నొల్ల నన్నేలు జలజనాభ!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**జలజనాభ! సౌఖ్యాలు కోరుదామంటే ఈ దేహము ఇక్కడ నిలిచేది కాదు. వంట్లో శక్తి ఎల్లవేళాలా ఒకే మాదిరిగా ఉండదు. బాల యౌవన వార్థక్యములలో మునిగిపోయే ము రికి కూపమిది. యిదంతా మాయ, నాటకము. నాకు అశాశ్వతమయిన ఇహలోక, శారీ రక సౌఖ్యములు వలదు. జన్మరాహిత్యము నొసగుము.**

81. భావంబు నీనామ భజన గోరుచునుండు, జిహ్వ నీ కీర్తనల్, చేయఁగోరు,
హస్తయుగ్మంబు నిన్నర్చింపఁగోరును, గర్ణముల్ నీమీఁది కథను గోరు,
దనువు నీ సేవయే ఘనముగాఁ గోరును, నయనముల్ నీ దర్శనంబుఁ గోరు,
మూర్థమ్ము నీ పదంబుల మ్రొక్కఁగాఁ గోరు, నాత్మ నీదైఁయుండు నరసిచూడ,
స్వప్నములనైన నేవేళ సంతతమును
బుద్ధి నీ పాములయందుఁ బూనియుండు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఆలోచన నీ భజనవైపు, నాలుక నీ కీర్తనలు, చేతులు నీ పూజలు, చెవులు నీ కథలు, శరీరము నీ సేవ, నేత్రములు నీ దర్శన భాగ్యము, శిరము నీ పాదములను సదా కోరు చున్నాయి. ఓ నారసింహా! నా శరీరాంగములన్నియు నిన్నే కోరుచున్నవి. మనసా, వాచా, కర్మణా నా భావములన్నియు నీకే అంకితము స్వామీ.**

82. పద్మాక్ష! మమతచే! బరమునందెదమంచు విఱ్ఱవీగుదుమయ్య! వెఱ్ఱిపట్టి
మా స్వతంత్రంబైన మదము కండ్లకుఁ గప్పి మొగముపట్టదు కామ మోహమునను,

బ్రహ్మదేవుండైనఁ బైఁడి దేహముఁ గల్గఁ జేసివేయక మమ్ముఁ జెరిచెనతఁడు,
తుచ్ఛమైనటుంటి తోలెమ్ముకలతోడ ముఱికిచెత్తలు చేర్చి మూటకట్టె,
నీ శరీరము పడిపోము టెఱుఁగకేము
కాముకులమైతి! మిఁకమిమ్ము గానలేము,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**పద్మాక్ష! అజ్ఞులమగుటచే దేహభ్రాంతితో మిము గుర్తించలేక అహంకరించుచున్నాము. మోహ పరవశులమయి నిను స్మరించలేకున్నాము.**

83. గరుడవాహన! దివ్య కౌస్తుభాలంకార రవికోటితేజ! సారంగవదన!
మణిగణాన్విత! హేమ మకుటాభరణ! చారు మకరకుండల! లసన్మందహాస!
కాంచనాంబర! రత్న కాంచీవిభూషిత! సురవరార్చిత! చంద్ర సూర్యనయన!
కమలనాభ! ముకుంద! గంగాధరస్తుత! రాక్షసాంతక! నాగరాజశయన!
పతితపావన! లక్ష్మీశ బ్రహ్మజనక!
భక్తవత్సల! సర్వేశ పరమపురుష!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**గరుడవాహనా! కోటి సూర్యతేజా, సొగసుకాడా అను వివిధ నామములచే నారసింహుని స్మరించుచూ శేషప్పకవి నీకిదే నా వందనమను చున్నారు.**

84. పలుమాఱు దశరూపములు ధరించితివేల? నేకరూపముఁ బొందవేల నీవు?
నయమున క్షీరాబ్ధి నడుమఁ జేరితివేల? రత్నకాంచన మదిరములు లేవె?
పన్నగేంద్రునిమీఁదఁ బవ్వళించితివేల? జలతారు పట్టెమంచములు లేవె?
ఱెక్కలుగల పక్షినెక్కసాగితివేల? గజతురంగాందోళికములు లేవె?
వనజలోచన! యిటువంటి వైభవములు
సొగసుగా నీకుఁ దోఁచెనోఁ సుందరాంగ!

భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**వనజలోచనా! పదే, పదే పది అవతారములనే ఎందుకు పొందినావు. ఒక అవతారము చాలదా. నీకు మంచి గృహము లేకనా పాలసముద్రము నివసిస్తునావు. జలతారు పట్టె మంచములు లేకనా శేషునిపై పండినావు. వేరు వాహనములు లేకనా పక్షీంద్రుని ఎక్కి నావు. ఏమయా నీ వేడుక.**

85. తిరుపతి స్థలమందుఁ దిన్నగా నేనున్న వేంకటేశుఁడు మేఁత వేయలేఁడె?
పురుషోత్తమునకు బోయిన జాలుఁజ గన్నాథు డన్నంబుఁ గడపలేఁడె?
శ్రీరంగమునకు నేఁజేర బోయినఁజాలు స్వామి గ్రాసము పెట్టి సాఁకలేఁడె?
కాంచీపురములోన గదిసి నే కొలువున్నఁ గరివరదుఁడు పొట్ట గడపలేఁడె?
యెందుఁబోవక నేను నీ మందిరమున
నిలిచితిని, నీకు నామీఁద నెనరు లేదు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ నరసింహస్వామీ! నెనెక్కడికిపోక నిన్నంటుకుని వున్నాననా నాకు తిండి పెట్టక వున్నావు. తిరుపతిలో గానీ, పూరిలోగానీ, కంచిలోగానీ, స్వామి నాకు తిండి పెట్టడా**

86. తారక్ష్యవాహన! నీవు దండి దాత వటంచుఁ గోరి వేడుక నిన్నుఁ గొల్వవచ్చి
యర్థిమార్గమును నే ననుసరించితి నయ్యలా వెనుబదినాల్గు లక్షలైన
వేషముల్ వేసి నా విద్యా ప్రగల్భతఁ జూపసాగితి నీకు, సుందరాంగ!
యానందమైన నే నడుగ వచ్చిన దిచ్చి వాంఛఁ దార్చుము నీలవర్ణ, వేగ
నీకు నావిద్య హర్షంబు గాకయున్న
తేప తేపకు వేషముల్ దేనుజుమ్మి!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**గరుడ వాహనా! నీవు గొప్పదాతవని ' ఉదరకృత బహుకృతవేష' మని ఎన్నివేషములు వేసినా నన్నెంచవేమి స్వామీ.**

87. అమరేంద్రవినుత! నే నతిదురాత్ముఁడనుఁ గలలోన నైనను గనులఁబడవు,
నీవు ప్రత్యక్షమై నిలువకుండిన మానె, దొడ్డగా నొక యుక్తి దొరకెనయ్య!
గట్టికొయ్యను దెచ్చి ఘనముగా ఖండించి నీ స్వరూపముచేసి నిలుపుకొందు
ధూప దీపములిచ్చి, తులసితోఁ బూజించి నిత్య నెవేద్యముల్ నేమముగను,
నడపుచును నిన్నుఁ గొలిచెద నమ్మి బుద్ధి
నీ ప్రపంచంబు గలిగె నా కింతెచాలు,
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**అమరేంద్రవినుత! నేను అతిదుర్మార్గుడననా కలలో కూడ కనబడవు. నీవు నాకు కాన్పింపకున్న కొయ్యముక్కచే నీ ప్రతికృతిని చేసి దానినే పూజించెదను.**

88. భువనేశ గోవింద! రవికోటిసంకాశ పక్షివాహన! భక్త పారిజాత!
యంభోజభవరుద్ర జంభారి సన్నుత! సామగాన విలోల! సారసాక్ష!
వనధిగంభీర! శ్రీవత్సకౌస్తుభవక్ష! శంఖచక్రగదాని శారంగహస్త!
దీనరక్షక! వాసుదేవ! దైత్యవినాశ! నారదార్చిత! దివ్యనాగశయన!
చారునవరత్నకుండల శ్రవణయుగళ!
విబుధవందిత పాదాబ్జ విశ్వరూప!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ సమస్త భువనముల రక్షించేవాడా! గోవిందా! రవికోటిసంకాశ! పక్షివాహన! భక్త పారిజాత! బ్రహ్మరుద్రులచే పూజింపబడువాడా! సామగాన విలోల! విశ్వరూప! బహు రూపీ! సహస్రనామా! నీకిదే నా వందనము.

89. నాగేంద్రశయన! నీ నామ మాధుర్యంబు మూఁడుకన్నుల సాంబమూర్తి కెఱుక;
పంకజాతాక్ష! నీ బలపరాక్రమమెల్ల భారతీపతియైన బ్రహ్మకెఱుక;
మధుకైటభారి! నీ మాయాసమర్థత వసుధలో బలిచక్రవర్తి కెఱుక;
పరమాత్మ నీదగు పక్షపాతిత్యంబు దశశతాక్షుల పురందరున కెఱుక;
వీరికెఱుకగు నీకథల్ వింతలెల్ల
నరుల కెఱుకన్న నెవ్వరైన నవ్వివోరె?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నాగేంద్రశయనా! త్రిమూర్తులు, బ్రహ్మాదిరుద్రులు ఎరుగని నీ మాయలు మాకు తెలి యునన్న జనులు నవ్వరా స్వామీ.

90. అందరేమైన నిన్నడుగ వచ్చెద రంచు క్షీరసాగరమందుఁ జేరినావు,
నీ చుట్టు సేవకుల్ నిలువకుండుటకునై భయద సర్పముమీఁదఁ బండినావు,
భక్త బృందము వెంటఁబడి రచించెద రంచు నెగసిపోయెడి పక్షినెక్కినావు,
మౌనులు నీ ద్వారమాసింపకుంటకు మంచియోధుల కాపలుంచినావు,
లావు గలవాడవైతి; వేలాగు నేను
నిన్నుఁ జూతును? నా తండ్రి నీరజాక్ష!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

స్వామీ! నీ మాయా విలసనమునేమని పొగడను. జనాలు వెంటబడి వరములు కోరు దురని పాలసముద్రము చొచ్చినావు. అట్లైనను చొచ్చుకొని వచ్చెడు వారుందురని అతిభీ కరములయిన పాపశయ్యపై పరుండితివి. భక్తులకు దుర్లభమయిన ఆకాశ గమనముకై

గరుడు నెన్నుకుంటిని. మునులు నీ ద్వారము చేరకుండ అరివీర భయంకరులను కాపుంచినావు.

91. నీ కథల్ చెవులలో సోకుఁట మొదలుఁగా బులకాంకురము మేనఁ బుట్టువాఁడు
నయమైన నీ దివ్యనామకీర్తనలోన మగ్నుఁడై దేహంబు మఱచువాఁడు,
ఫాలంబుతో నీదుపాదయుగ్మమునకుఁ బ్రేమతో దండమర్పించువాఁడు,
హా పుండరీకాక్ష; హా రామ! హరి! యంచు వేడ్కతో ఁ గేకలు వేయువాఁడు,
చిత్తకమలంబునను నిన్ను ఁజేర్చువాఁడు,
నీదు లోకంబునందుండు నీరజాక్ష!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నీరజాక్ష! నీ కథల్ చెవులలో సోకుఁటచే మేను పులకించువాడు. నీ దివ్యనామకీర్తనలో నిమగ్నుఁడై దేహంబు మఱచువాఁడు, ఫాలంబుతో నీదుపాదయుగ్మమునకుఁ ప్రేమతో దండమర్పించువాఁడు, హా పుండరీకాక్ష; హా రామ! హరి! అంటూ వేడుకతో హర్షము చేయువాఁడు, హృదయకమలంబున నిన్నుంచు వాఁడు, నీదు లోకంబునందుండు, నీ మనస్మరణచే మైమరచిన నన్ను నీలోకము చేర్చి మోక్ష మొసగుము.

92. నిగమగోచర! నేను నీకు మెప్పగునట్లు లెస్సగాఁ బూజింపలేను సుమ్మి,
నాకు దోచిన భూషణములు పెట్టెదనన్నఁ గౌస్తుభమణి నీకుఁగలదు ముందె,
భక్ష్యభోజ్యముల నర్పణముఁ జేసెదనన్న నీవు పెట్టితి సుధ నిర్జరులకు,
గలిమికొద్దిగఁ గానుకల నొసంగెదనన్న భార్గవీదేవి నీ భార్యయయ్యె,
నన్ని గలవాఁడ నఖిలలోకాధిపతివి,
నీకు భూషాదులనుబెట్ట నెంతవాఁడ?
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

నిగమగోచర! నీకు మెప్పకలుగునట్లు నిన్ను పూజింపలేను. కౌస్తుభమే ఆభరణమైన

నీకు ఏ ఆభరణము లీయలేను. వివిధ ఆహారపదార్థము లిచ్చెదమన్న అమృతమే నీకాహారము కదా స్వామీ. లక్ష్మీధవుడవైన నిన్ను ఏ పదవిచ్చి సంతసపరచగలను స్వామీ. అల్పజ్ఞుడను. నా మానసమే నీకియ్యగలను.

93. నవసరోజదళాక్ష నన్ను బోషించెడి దాతవు నీవంచు ధైర్యపడితి,
నామనంబున నిన్ను నమ్మినందుకుఁ దండ్రి! మేలు నా కొనరింపు నీలదేహ?
భళి భళి? నీయంత ప్రభువునెక్కడఁజూడఁ పుడమిలో నీ పేరు పొగడవచ్చు,
ముందుఁ జేసిన పాపమును నశింపగఁజేసి, నిర్వహింపుము నన్ను నేర్పుతోడఁ
బరమ సంతోషమాయె నా ప్రాణములకు
నీ ఋణముఁ దీర్చుకొననేర నీరజాక్ష!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ పద్మసంభవా! నవసరోజదళాక్ష నన్ను బోషించెడి దాతవు నీవేనని ధైర్యంగావున్నాను, తండ్రీ నిన్ను నమ్మినందుకు నాకు మేలొనరింపుము. నిన్ను నమ్మి చెడినవారు లేరు కదా ఈశ్వరా.

94. ఫణుల పుట్టలమీదఁ బవ్వళించినయట్లు పులుల గుంపునఁ జేరఁబోయినట్లు,
మకరి వర్గంబున్న మడుఁగు జొచ్చినయట్లు, గంగదాపున నిండ్లుఁ గట్టినట్లు,
చెదలభూమినిఁ జాప చేర బఱచినట్లు, లోలుతిత్తినిఁ బాలు బోసినట్లు,
వెఱ్ఱివానికి బహు విత్త మిచ్చినయట్లు, కమ్మగుడిసె మందుఁ గాల్పినట్టు,
స్వామి! నీ భక్తవరులు దుర్జనులతోడఁ
జెలిమిఁజేసిన యటులైన జుటువచ్చు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

స్వామీ! నీ భక్తులు దుర్జనులతో స్నేహము చేయ పాములపుట్ట మీద నిదురించినట్లు,

పులుల గుహలోనికి చేరినట్లు తెలివిలేని వాని చేతికి సొమ్ము ఇచ్చినట్లు.

95. ధనుజ సంహార! చక్రధర! నీకు దండంబు లిందిరాధిప! నీకు వందనంబు,
పతిపావన! నీకు బహు నమస్కారముల్, నీరజాత దళాక్ష నీకు శరణు,
వాసవార్చిత! మేఘవర్ణ! నీకు శుభంబు, మందర ధర! నీకు మంగళంబు,
కంబురంధర! శార్ఙకర! నీకు భద్రంబు, దీనరక్షక కీకు దిగ్విజయము,
సకల వైభవములు నీకు సార్వభౌమ!
నిత్య కళ్యాణములు నగు నీకు నెపుడు;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ధనుజ సంహార! చక్రధారి! నీకు దండములు ఇందిరాధిప! నీకు వందనాలు పతిపావన నీకు బహు నమస్కారములు, కమలపత్రాక్ష నీకు శరణు, మేఘవర్ణ! మందర పర్వతము మోసినవాడా! నీకు శుభము, నీకు మంగళంబు, ధనుర్ధారి! నీకు భద్రంబు, దీనరక్షక నీకు దిగ్విజయము, సకల వైభవములు నీకు సార్వభౌమ! నిత్య కళ్యాణములు నీకు నెపుడు; ఈ పద్యములో స్వామి వివిధ నామములు తలిచి కవి మంగళశాసనము చదువు చున్నాడు.

96. మత్స్యావతారమై మడుగులోపలఁజొచ్చి సోమకాసురుఁ ద్రుంచి చోద్యముగను;
దెచ్చి వేదములెల్ల మెచ్చ దేవతలెల్ల బ్రహ్మకిచ్చితి నీవు భళి యనంగ;
నా వేదముల నంది యాచారనిష్ఠల ననుభవించుచు నుందు రవనిసురులు;
సకల పాపంబులు సమసిపోవు నటంచు మనుజులందఱు నీదు మహిమఁ దెలియ
కుందు, రరవిందనయనఁ నీ యునికిఁ దెలియు
వారలకు వేగ మోక్షంబు వచ్చు ననఘ!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

మత్స్యావతార! నీవు సోమకాసురుని సంహరించి తెచ్చి యిచ్చిన వేదములతోనే బ్రాహ్మ

ఱులు నీ మహోత్మ్యము గానము చేయుచున్నారు.

97. కూర్మావతారివై కుధరంబు క్రిందను గోర్కెతో నుండవా కొమరు మిగుల
వారహమూర్తివై వనభూములం జొచ్చి శిక్షింపవా హిరణ్యాక్షునపుడు
నరసింహమూర్తివై వసుధలో బలిచక్ర కశివుని( ద్రుంచవా కాంతిమీఱ?
వామనరూపివై వసుధలో బలిచక్ర వర్తి నణంపవా వైరముంచి?
యిట్టి పనులెల్ల( జేయ(గా నెవ్వరికిని(
దగును నరసింహ నీకిది తగునుగాక;
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా! నీ కూర్మావతారమును, వరాహరూపమును, నరసింహరూపుని, వామనుని స్మరించి పూజించెదను.

98. లక్ష్మీశ! నీ దివ్య లక్షణగుణముల విన(జాల కెప్పుడు వెఱ్ఱినైతి;
నా వెఱ్ఱి గుణమును నయముగా ఖండించి నన్ను రక్షింపుమో నళిననేత్ర!
నిన్ను నే నమ్మితి నితర దైవముల నే నమ్మలే దెప్పుడు నాగశయన!
కాపాడినను నీవె కష్టపెట్టిన నీవె; నీ పాదకమలముల్ నిరతి నేను
నమ్మియున్నాను; నీపాద నళినభక్తి
వేగ దయచేసి రక్షింపు వేదవేద్య!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఓ నరసింహా!లక్ష్మీనాథ! నీ దివ్య లక్షణగుణముల వినకపోతే వెఱ్ఱివాడనౌతాను; నేను నిన్నే నమ్మాను ఇతరదైవములను నమ్మలేదెప్పుడు. నాగశయన! కాపాడినా నీవె కష్టపెట్టినా నీవె; నీ పాదకమలములు ఎల్లవేళలా నేను నమ్మియున్నాను. వేదవేద్య! 'నీవే తప్పనిత: పరంబెరుగ, మన్నించదగునే దీనునికే' అన్నట్లు నన్ను రక్షింపుము.

99. అమరేంద్రవినుత! నిన్ననుసరించినవారు ముక్తి బొందిరి వేగ ముదముతోడ
నీ పాద పద్మముల్ నెఱ నమ్మియున్నాను నాకు మోక్షంబిమ్ము నళిననేత్ర!
కాఁచి రక్షించు నన్ గడతేర్చు వేగమే నీ సేవకునిఁజేయు నిశ్చయముగ
గాపాడినను నీకుఁ గైవంకర్యపరుఁడనై చెలఁగి నీ పనులను జేయువాఁడు;
ననుచుఁ బలుమారు వేడెద నబ్జనాభ
నాకు బ్రత్యక్షమగు నిన్నె నమ్మినాను
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

**ఓ అమరేంద్రవినుత!నిన్ననుసరించినవారు ఎందరో ముక్తిని అతి తొందరగా పొందారు. నీ పాదపద్మములనే నమ్మియున్నాను నాకు మోక్షమొసగుము. నళిననేత్ర! నాకు బ్రత్యక్ష మగు నిన్నె నమ్మినాను 'నిను నమ్మిన వారి కెన్నటికిని దోషము లేదు' కనుకనే నన్ను కావుము.**

100. శేషప్పయనుకవి చెప్పిన పద్యముల్ చెవుల కానందమై చెఁలగుచుండు;
నేమనుజుండైన నెలమి నీ శతకంబు భక్తితో విన్న సత్ఫలము గలుగుఁ;
జెలఁగి యీ పద్యముల్ - చేర్చి వ్రాసినవారు కమలాక్షు కరుణను - గంతురెపుడు
నింపుగా బుస్తకం - జెపుడు బూజించిన దురిత జాలంబులు - దొలగిపోవుము
నిద్దిపుణ్యకరంబని - యెపుడు జనులు
కష్టనునక పఠించినం గలుగు ముక్తి
భూషణ వికాస శ్రీధర్మ - పురనివాస
దుష్టసంహార నరసింహ - దురితదూర!

**ఓ నరసింహస్వామీ! శేషప్ప అను ఈ కవి వ్రాసిన పద్యములు చెవులకు ఇంపుగా వుంటాయి. ఈ శతకమును భక్తితో విన్నా చక్కని ఫలము కలుగుతుంది. ఈ పద్యములను ప్రచురించినవారిపై /వ్రాయించినవారిపై /ప్రచారములో వుంచిన వారిపై శ్రీమన్నారాయణుని కృప ఆపారంగావుంటుంది. ఈ నరసింహ శతక పుస్తకమును పూజించిన వారి బాధలు పోవును. ఈ శతకము పఠించిన ముక్తి కల్గును.**